# యువజనోద్యమము : దాని మహాత్మ్యము

మానవత్వ మన స్త్రీ పురుష సమ్మేళనము. ఈశ్వర సృష్టి, స్థితి, లయములకును సాధనభూతము స్త్రీ పురుష సమ్మేళనమే! ఉభయుల కలయిక లేనిది మానవత్వ పరిపూర్ణత సిద్ధించజాలదు. ఈ స్త్రీపురుషుల జీవన నిర్వాహణార్థమే ఒక సంఘము, ఒక మతము, ఒక దేశము, చివర కొక ప్రపంచ మత్యావశ్యకమైయున్నది. సంఘ మత దేశ ప్రపంచ నిర్మాణమును మానవత్వమునకే యుద్దేశింపబడినవి, కాని మానవ సంఘ నిర్మూలనమునకు కాదు.

సదుద్దేశ్యపూరితమై, స్వార్థరహితమై, పరోపకారిణమై సదభిమానభరితమై యున్నంతవరకు సంఘములు, సంఘీయుల శ్రేయమునకే సర్వశక్తులు వినియోగించుట సహజము. తద్విపరీత పరిస్థితులలో సంఘ విధ్వంసమే సంఘముల ప్రధాన లక్ష్యమై యొప్పుట తథ్యము.

ఆర్థిక, రాజకీయ, సాంఘిక, మతవిషయసంబంధమైన సాధనమునకే ఆ యా సంఘములు నిర్మింపబడినవి.

స్వజాతీయప్రభుత్వము విద్యమానమై యుండి సకల జనుల హక్కులు సహేతుకముగ సంరక్షింపబడుచున్నంత కాలము యే సంఘముల యావశ్యకతయు లేకుండెను. కాల క్రమేణ మన దౌర్భాగ్యవశమున మన దేశమునకే దుర్దినములు సంప్రాప్తమై, జాతీయప్రభుత్వము ఛిన్నాభిన్నమై పర ప్రభుత్వపరిపాలన ప్రబలిపోయి దేశీయులపట్ల సవతితల్లిప్రేమ ప్రదర్శింపబడుచున్న కారణమున కుల, మత, సంఘముల యభ్యుదయమునకు ఆయా ప్రత్యేక సంఘసంస్థాపనావసరము గమనింపబడినది.

అటులనే స్వధర్మదూరులై, కేవలము ధనమునే ప్రధానముగానూ, సర్వస్వముగానూ తలంచి దేశమునకు ప్రాణాధారమైన వర్తకమునుకూడా చేతులార జారవిడిచి యధోగతి ననుభవించుచున్న వైశ్యసంఘ శుభోదయమునకు సహితము ఒక సంఘ నిర్మాణము జరిగించవలసివచ్చినది. ఆ సంఘ సృష్టియే వైశ్యమహాసభ.

మహాసభవలన సంఘమునకు కొంత యుపకారము జరిగిన , తగినంత పురోగమనము లేనను కారణమున సంఘమునకు నూతన జీవము పోసి, సంచలనము కలిగించి పురోగమింపజేయు సంకల్పముతో "వైశ్య యువజన మహాసభా" సంస్థాపనము జరిగినది.

దాని స్థాపనానంతరము సంఘోన్నతికొరకు కొంత యుత్సాహము ప్రదర్శింపబడినను క్రమేణ యుత్సాహము తగ్గడము, కొంతకాలము యువజనసభ, మహాసభల కలహములతో కాలము గడవడము, కొన్ని సంవత్సరములు అసలు సభలే సమావేశముకాకుండ గడచిపోవడముజరినగిది.

వైశ్యసంఘముయొక్క అహోభాగ్యమో యనునట్లు శ్రీయుత ఉప్పల గౌరీశంకరుగుప్తగారి అగ్రాసనాధిపత్యమున, బందరుపట్టణమున జరిగిన యువజనమహాసభనుండి మరల కొంత యభివృద్ధికి దోహదమై, ప్రస్తుతాధ్యక్షులైన శ్రీయుత కొల్లా కాశీవిశ్వనాధంగుప్తగారి యాధ్వర్యమున మదరాసు నందు జరిగిన మహాసభ కాలమునుండి, యువజనోద్యమము దినదిన ప్రవర్ధమాన మగుచున్నది. అధ్యక్షులవారి కార్య కుశలత, నిర్మాణ కార్యక్రమ నిర్వహణ దక్షత, వైశ్యసంఘ మహోన్నత దశయే ప్రధాన లక్ష్యముగా గల

వారి యసంతత దీక్షల ఫలితముగా వైశ్యసంఘమునందు నూతన చైతన్యము వెల్లివిరిసి, 250 సంఘములు స్థాపింపబడి యువజనమహాసభ కార్యక్రమము నిరంతరాయముగ కొన సాగుచున్నది. అచ్చటచ్చట వైశ్యులలో గల తగవులు పరిష్కరింపబడుచున్నవి.

ఇంతమాత్రమున యువజనమహాసభకు పరిపూర్ణత్వము సిద్ధించినదని చెప్పవీలులేదు. ఇంకను యెంతయో ప్రచార ప్రబోధ ప్రయత్నము జరుగవలసియున్నది. సంఘము నింకను యెంతయో సంఘటితపరుపవలసి యున్నది. సంఘీయులను వీరులుగా, విజ్ఞానవేత్తలుగా, కలగుణసంపన్నులుగా సమాయత్తపరుపవలసిన కార్యకలాపము యింకను యెంతయో దిగ్దర్శన మొనర్పవలసియున్నది.

వైశ్యులు బలపరాక్రమ విజ్ఞాన తేజోవిరాజితులై వెలసిల్లి వైశ్యసంఘము మహోన్నతస్థాన మలంకరించి ప్రపంచవాసుల జేజే లందుకొనుటకు సంఘీయుల స్వార్థవిరహితమై ద్వేషరహితమై, అభిమాన భరితమై, పౌరుషప్రపూరితమైన సన్నిహిత సహకార మెంతయో యవసరమైయున్నది.

ప్రపంచమున భారతావని స్థానము, భారతదేశమున హిందూమతగౌరవము, హిందూమతములో వైశ్యుల ప్రతిష్ఠ, ప్రతిపత్తులు లోకానుభవము గల ప్రతివారికిని తెలిసినదే! అట్టిచో వైశ్యసంఘ సర్వతోముఖాభివృద్ధికి యెంతటి తీవ్రకృషి యవసరమో వేరుగ విశదీకరింపబని లేదు.

కావున, వైశ్యులలోగల పరస్పర వ్యక్తిగత అసూయా ద్వేషములను విడనాడి వైశ్యసంఘయోన్నత్యముచే పరమ లక్ష్యముగా నిడుకొని, ఆశయసాఫల్యమునకు సర్వశక్తులు విని

యోగించి సఫలీకృత మనోరథు లగుట యవశ్యకర్తవ్యము.

ఈ బుర్రకథా ప్రచురణము దినదినాభివృద్ధి గాంచు చున్న యువజనోద్యమ ఫలితమే! యువజనోద్యమము ను తేజయుద్ధృతములతో నడపించుచు యువజనుల నుఱ్ఱూత లూగించుటయే యీ కథాప్రచురణములోని సత్సంకల్పమని కథాధోరణియే చెప్పక చెప్పుచున్నది. ఇది యఖిల భారత ఆర్యవైశ్యయువజన మహాసభాపక్షమున ప్రకటింపబడినను, వైశ్యేతరులై, మత, దేశగౌరవాకాంక్షితులైన ఆంధ్రయువకు లెల్లరు దీని నుపయోగించుకొని లాభముపొందు నవకాశము లిందు మూర్తీభవించియున్నవి. అట్టితరి వైశ్య లీ యుద్గ్రంథమువలనపొందుప్రయోజనములనువర్ణింపవీలు లేదు.

మానవసంఘోన్నతికొర కుద్దేశింపబడిన పవిత్ర ధర్మ ములనుఅధికారబలముచేతను, స్వలాభపరాయణత్వముచేతను తారుమారొనర్చి లోకవంచనకు, మతవంచనకు, ప్రజావంచ నకు, ధర్మవంచనకు పాల్పడిన ద్రోహచర్య లీకథారూపమున కండ్లకు గట్టినట్లు వర్ణింపబడియున్నవి. ఇందులకు కథాకర్త లైన శ్రీ యక్కలి రామయ్యగారెంతయు ప్రశంసాపాత్రులు. నిజముగా మూఢ విశ్వాసములు, దురాచారములు భ్రష్టధర్మ ములనే పరమపూజ్యములుగా భావించి వాటికి దాసానుదా సులై సత్య ధర్మములను, యదార్థమైన యాచారముల నవలం బింపక అధోగతి ననుభవించుచున్న మానవకోటి కీగ్రంథము మార్గదర్శకమని, తరుణోపాయమని ఘంటాపథముగ చెప్ప వచ్చును. కవిగారి నిందులకు ప్రోత్సహించి వైశ్యసేవతో పాటు యావదాంధ్రదేశీయ హిందూమతసేవ కుపకరించు యిట్టి సద్గ్రంథమును వ్రాయించి ప్రకటించిన వైశ్యయువజన

మహాసభయు, ముఖ్యముగా సభాధ్యక్షులగు శ్రీ కొల్లా కాశీ విశ్వనాథము గుప్తగారును ధన్యులు.

యువజనమహాసభ అభ్యుదయమహాసభయై విరాజిల్లినది. నిద్రాణమై, తన యస్తిత్వమునే గోల్పోవనున్న సంఘమునందు విప్లవము పుట్టించి వీరవిహారము సల్పునంతటి శక్తి సామర్థ్యములను ప్రసాదించినది. వైశ్యసంఘ సౌభాగ్యాభివృద్ధి యువజనమహాసభపైననే యాధారపడియున్నది. వైశ్య సంఘ సర్వతోముఖాభివృద్ధియే యువజనమహాసభ ధ్యేయము. అదియే దాని పరమావధి. తన్నిర్మిత కార్యప్రణాళికలే దానికి ప్రబల నిదర్శనము. అందు వయోనిర్ణయము లేదు. ఉత్సాహాభిమానములను ప్రదర్శించి సంఘసేవ సలుపసమకట్టిన వృద్ధులు సహితము నవయువకులే యని యువజనమహాసభా నిర్ణయము. సంఘము నందలి యాబాలగోపాలమంతు నిరాటంకముగ, నిస్సందేహముగ ప్రవేశించి సంఘ మహోదయమునకు సాయపడవచ్చును. మానవత్వ పరిపూర్ణతకు భాగస్వామినియైన స్త్రీప్రవేశమునకును ద్వారము తెరచిపెట్టబడియున్నది. ఎట్టివారికిని కవాటములు బంధింపబడలేదు. స్త్రీ పురుషులకు సమాన హక్కులు ప్రసాదించుటయు యువజన సభ మహదాశయమైయున్నది.

" ముందున్నది ముసళ్ల పండుగ '' యన్నట్లు రాను రాను మన మింకను అత్యంత క్లిష్టపరిస్థితుల నెదుర్కొనవలసి యున్నది. ఎన్నియో భయంకర పరిణామములను ఢీకొనవలసి యున్నది. యుద్ధానంతర ప్రపంచ నిర్మాణములో ప్రతివాని భాగ్యనిర్ణయము గావింపబడనున్నది. అది యెల్లరకును అగ్ని పరీక్షవంటిది. అట్టి పరీక్షలో నుత్తీర్ణుల మగుటకు యీక్షణము

నుండియే సర్వసన్నద్ధులము గావలసియున్నది. సన్నాహము లేక స్తంభించి కూర్చొనెదమా, యిక మన గతి అధోగతియే!

కావున నో వైశ్యయువకుడా! లెమ్ము. సంసిద్ధుడవు కమ్ము. యువజనమహాసభలో చేరుము. దాని కష్టనిష్ఠురము లలో భాగస్వామివై, రాబోవు నూతన ప్రపంచములో సముచిత స్థానమును భద్రపరచుకొనుము. ధర్మసంస్థాపనార్థము భగవదాజ్ఞచే పదియవతారముల నెత్తజేయబడినటులే వైశ్య సంఘసముద్ధరణకొరకు, యువజనమహాసభయు పది యధివేశన ములనెడి దశావతారములను దాల్చినది. సంఘమునకు తనకర్త వ్యమును విధ్యుక్తధర్మము నుపదేశించినది. కర్తవ్యబోధను చెవియొగ్గి విని, గమ్యస్థాన మార్గము ననుగమించి, లక్ష్యసిద్ధి యొక్క సాక్షాత్కార దృశ్యము నవలోకించుటకు యావచ్ఛ క్తులను కేంద్రీకరించుట ప్రతి వైశ్యుని యవశ్యకర్తవ్యము.

యువజన మహాసభా బాలిక వచ్చీరాని మాటలతో తప్పటడుగులతో గూడిన తన శైశవావస్థను దాటి శిక్షణా సమన్వితమైన నృత్యమును సలుపు బాలికగా సిద్ధమైనది. స్వీయపుత్రికయైన పదునొకండు సంవత్సరముల బాలికయొక్క సకల విధ సంరక్షణ బాధ్యత వైశ్యసోదరుల భుజస్కంధము లపై నిలచియున్నది.

వైశ్యసంఘము యిట్టి బాధ్యతా నిర్వహణమునందు తన పాత్ర నెటుల సమర్థించుకొనునో యని లోకము కనిపెట్టు కొనియున్నది.

ఆర్యవైశ్య యువజన సంఘము
తిరుమలగిరి బజారు (దక్కన్)

రామాప్రెస్. (చిత్రటాకీసువద్ద) సికింద్రాబాదు.

ఓం.

—* వందేమాతరం *—

# యువజనోద్యమము.

## బుర్రకథ

### —♦ కృతిసమర్పణము ♦—

గీతమాలిక:—

విశ్వకళ్యాణ దృష్టిలో । వివిధగతుల
తలచియును, నిగ్గుతేల్చిన । దైవిక, మత
సాంఘికపు ధర్మములనెల్ల । సంపుటించి
మూఢవిశ్వాస విప్లవ । స్ఫూర్తినెఱపి,
దేశజాతీయభావ, మే । ర్తైఅఘటించి,
నవ్యహైందవ యువక స । న్మానపాత్రి,
మగునటుల నేరచించిన । యట్టి "వైశ్య
యువజనోద్యమ" కృతిని, నే । నొసగుచుంటి,
నఖిలభారత యువక వైశ్య । ప్రకాశ
కరమహోన్నత సంస్థకు । కౌతుకమున

వందుకొనుమయ్య! ప్రస్తుతా । ధ్యక్ష! కొల్ల
కాశీవిశ్వనాథాఖ్యయో । కరముప్రీతి

ఇట్లు,

కృతికర్త

1944 సం. యక్కలి రామయ్య

ఎర్రగొండపాలెం, మార్కాపురం తాలూకా.



# ఉపోద్ఘాతము

పాఠక మహాశయులారా!

నన్నెవరైన, నీవెవరని ప్రశ్నించినచో భారతీయుడనని చెప్పుకొనుటకు మాత్రమే యభిలషించువాడను. ఇంకను, తఱచి యడిగినచో, హిందువుడనని మాత్రము జంకులేక జవాబిచ్చెదను. అంతకుమించి చెప్పుకొనవలెనన్న అలుకుచుండువాడను ఏలనన, మొదటి రెండింటికే ముప్పువచ్చి యున్నప్పుడు మూడవదానికి నిలువనీడ యెక్కడ? ఇదివరలో నాచే రచించబడిన "భారత సత్యదర్పణము," "అలిపుర జైలుచరిత్రము." మొదలగు జాతీయ గ్రంథములనుచూచి, నాభావములను సంపూర్ణముగా తెలిసియుండియుకూడ, శుద్ధజాతీయవాదినగు నన్ను, "వైశ్య యువజనోద్యమము," అను గ్రంథమును రచింపుమని, మిత్రులు కోరుటలో, ప్రస్తుత వైశ్యకుల తత్వమును గాక సనాతన వైశ్యవర్ణ తత్వమును, పాఠకుల (శ్రోతల) హృదయములలో హత్తునట్లు చిత్రింపుమనిరనియే భావించితిని. వర్ణముకంటె మతమును, మతముకంటె దేశమును దేశముకంటె విశ్వమానవ కళ్యాణమును, తరతమములుగ ప్రేమించుచునే, కథనుపూర్తిజేసితిని. వైశ్యయువకులను సంబోధించుచు, ప్రారంభించినను, హైందవయువకుల సన్మానమునకుపాత్రమగునట్లు వ్రాసితిని. విశాలవిశ్వమానవ దృష్టిలో వైశ్యసంఘమును గాని, మరియొక వర్గమునుగాని సంస్కరింప యత్నించుట భారతజాతీయతకు లోటుకాదనియే నానమ్మకము

నేను వేదములయందు మ్మకము గలవాడనే, అయిన నందలి నైతికధర్మములు మాత్రమే, సర్వకాల సర్వఅవస్థల యందును పాటింపదగినవి, కాని యాచారధర్మములు మాత్రము దేశ కాల పరిస్థితులనుబట్టి మార్పుచెందుట సహజమని భావించువాడను, "నిన్ను నీవు సంస్కరించుకొనుము, నీతోడి జీవితో సౌహార్దముగ మెలగుము. దీనప్రాణులకు సహాయము చేయుము" అనెడి యుపదేశమే వేదవేదాంతములయొక్క సారాంశమని నమ్మువాడను. ఇకమతివిషయముననో? "నిజముగుమతము, ప్రధానమైన యాధ్యాత్మిక జ్ఞానమును విడనాడక ఆచారధర్మములను సంఘనీతిని, దేశకాల పాత్రములనుబట్టి సమాజాభివృద్ధి కనుగుణముగ మార్చుకొనుచుండును. ప్రజలకు ఐహికమగు జీవితసౌఖ్యము నొసగని మతము సరియగు మతము కాదు భారతదేశము నందిపుడెందరో ప్రజలు, సంఘము నందు సరిసమాన ప్రతిపత్తులులేక నల్లాడుచున్నారు. గౌరవప్రదమును, సౌఖ్యజీవన కరమునగు, జీవితప్రవృత్తి నొసగుట, మతముయొక్క ప్రధానకర్తవ్యము." అని శ్రీ యస్ రాధాకృష్ణ పండితుడు చెప్పిన యభిప్రాయముతో నేను సంపూర్ణముగా యేకీభవించువాడను.

సతాం హి సందేహ పదేషువస్తుషు ప్రమాణమంతఃకరణప్రవృత్తయః" అను శాకుంతలములోని సూక్తి ననుసరించిచూచిన, ధర్మసందేహ ముదయించినప్పుడు స్వార్థము, దురభిమానములేని సజ్జనునకు అంతఃకరణమే ప్రమాణము గదా! గనుక సత్యాన్వేషియు అరిషడ్వర్గ విజేతయునగు శ్రీ

గాంధీమహాత్ముని యంతఃకరణ ప్రబోధితములగు, మతవర్ణ ధర్మములయందు విశ్వాసముగలవాడను.

నేను గ్రంథమునందు, మూఢాచారములను తీవ్రముగ విమర్శించియుండుట నిజమే! గుడ్డిగా దాని ననుసరించువారికముందైన బాగుపడవలయు నను ప్రేమచేతనే యట్లు వ్రాసితినిగాన నాయందెవరును కినుకవహింపరని నమ్ముచున్నాను. వైశ్యసంఘములోని లోపములను వెలిబుచ్చుటలో, నేను సంఘీయుడను గాబట్టి మిక్కిలి చనువు తీసుకొన్నాను. సంఘసంస్కరణ బాధ్యతలో మనలను మనము పొగడుకొనుటవలన లాభములేదు. లోపములను చూపెట్టి చక్కదిద్దుటయందే ఫలముగలదు.

యక్కలి రామయ్య.



శ్రీ భారతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

ఓం.

— వందేమాతరం —

# యువజనోద్యమము.

## (బుఱ్ఱకథ)

### ప్రథమాశ్వాసము

#### — మాతృదేశ స్తవము —

రగడ:—

శ్రీకళ్యాణ విభూతుల నొసఁగను । చెన్నుమిగిలి యుండి
నైశ్వర్యంబుల కాలవాలమై । యనుపమ దేశంబై,
సుజలపూర్ణ నదీమతల్లులతో । సుందరవనములతో,
సారవంతమగు పొలములు గలదై । సస్యశ్యామలమై,
పశుపోషకమై, కృషికనుగుణమై । పారిశ్రామికమై,
ప్రాక్పశ్చిమ దక్షిణాదిశలందున । పారజలధి గలిగి
యుత్తరమున, హిమవన్నగ పంక్తిని । కొమ్ముగాను గల్గి
యతిదుర్భేద్యం, బగుదుర్గంబని । యవనిలోనతి గాంచి,
యుత్కృష్టంబగు, గిరులరణ్యముల । యుపయోగము గల్గి
సర్వవస్తు సమన్వితంబునై । సర్వఖనిజములకు
తావలమై, భూతలస్వర్గంబై । ధారుణీయందునను
రత్నగర్భ యనివినుతి కెక్కియును । రాణఁ జెందినట్టి,

శ్రీ శ్రీ భారతమాతరో! నీకివె । చేతములుపొంగ
నంజలు వీడెద పుత్రుడనగు నా । కాశీస్సులనిమ్ము

—* క థా ప్రా రం భ ము *—

# సనాతనకాలపరిస్థితి.



రగడ:— ( పల్లవిపదములు )

భావిభరత భాగ్యోదయులారా । వైశ్యయువకులారా!
భారతమాతృ సుపుత్రులారయో । భారతీయులారా!
హిందూమత సోదరులారా । యో । హైందవేయులారం!
వైశ్యసంఘ సంస్కారులారా । యో । వైశ్యయువకులారా

రగడ:—

మనదేశముదగు గతచారిత్రము । వినినా రేమయ్యా!
ఆసనాతనపు భూతకాలమున । నార్యావర్తమున
సువిశాలంబగు సర్వసమత్వపు । సూక్తులుబోధించు
వేదవిద్యలును స్మృతులు, శాస్త్రములు, వేదాంతంబులును,
మతసమైక్యతయు, మానవ సౌభ్రా । తృతలను బోధించు
యార్షమత గ్రంథంబులు వెలువడి । యార్యుల కాలమున
విశ్వమంతటికి జ్ఞానజ్యోతులు । విరజిమ్మినవండీ!
మంత్రవిద్యలును, యంత్రవిద్యలును । మహి వెలయించెనటా?
[॥ భార॥

అగణితంబుగను, గురుకులములు, ముని । యాశ్రమములుగల్గి
జ్ఞానసమితులును, కళాశాలలును । వేనవేలుగల్గి
పెక్కువిశ్వవిద్యాలయసంస్థలు । పేరొందినవండీ
యఖిల ప్రపంచములో విద్యార్థుల । కాకర్షణ నింపె?
సంస్కృతభాషయె సామాన్యంబై । సాగుచుండెనపుడు?
అరరే? పండితమండలులెన్నో । యానాడుండెనయా?
వహ్వారే? కవితాకన్యప్రతి యొకని । గాదిలిబిడ్డేను?
అహాహా? యణిమాద్యష్ట సిద్ధులును । నందరిసొమ్మేను?
ఆయుర్వేదము గ్రామీణులకును । యవగతమేనండీ ॥హిం॥
శౌర్యధైర్య గాంభీర్యపరాక్రమ । సాహసులగు వీరుల్
రణపాండిత్యముగల్గు యోధులగు । రాజులుండిరపుడు?
యుద్ధధర్మములనుండి తొలగరే । యొకశతాంశమైన,
ప్రజాకంటకం భీషణ్మాత్రము । ప్రబలనివ్వరండీ?
పేరుకు 'రాజు' గవ్యవహరించినను । పెద్దలయనుమతిని
వహ్వా? ప్రశాంతప్రజా ప్రభుత్వమే బరగ జేసిరయ్యా? ॥భారత॥
భారతదేశము కృషి గోరక్షణ । వాణిజ్యంబులకు
దేశ విదేశపు వర్తకములకును । దిటవగు కేంద్రంబై,
యుగములచేతనుఖండాంతరముల । నోడబేరములను
నిపుణతతోడను సాగింపగబడె । విపులంబుగనాడు?
వస్త్రోత్పత్తియు, వస్తుమార్పిడియు । వస్తువిక్రయములు
స్వాతంత్ర్యముతో లాభకరముగా । సాగుచుండెనపుడు॥వైశ్య॥
పుడమి యీనినట్లెల్లయెడల, గో । వుల మందలుగల్గి,
కోడెలు, యెద్దులు వ్యవసాయమునకు । కోట్లకొలది గలిగి,

పాడిపంటలతో తులదూగిరయా । ప్రజలందరునాడు!
అప్పుడురాట్నము సకల కుటీరము । లందున రొదనించె,
చేతిమగ్గములు పడుగుపేకలు । జీవముతోనుండె.
కమ్మర, కుమ్మర, వడ్రింగంబులు । కంసలి వృత్తులును
చర్మకారకము, మేదర, మంగలి, చాకలి వృత్తులును
రంగులద్దుటయు, గొండా వృత్తులు । రాణించెనునాడు-
ఒక్కరాతిలో స్తంభ మండపము । చెక్కశిల్పులుండే,
చంక్రంబులతో గూడ రథమునొక । చెట్టులో మలచిరయా
[॥భావి॥

స్వయంపోషకంబై గ్రామీణపు । సర్వవృత్తులున్న
సామరస్యముగ సాగుచుంటచే । సకల జనులునాడు,
ఒకరిని మఱియొకరెట్లో వంచన । నొనరించినగాని
భుక్తిగడుపదని బాధలేదు, గా । వున, నవియురుదయ్యో
నిరుద్యోగులును వృత్తివిహీనులు । విరివిగ లేరపుడు?
ఆర్థికంబుగను హెచ్చుతగ్గులపు । డంతగ లేకుండే
పసుసంపదయో భూసంపదయో । ప్రతియొకరికిగల్గి
పాడిపంటలు! ధనధాన్యములో । తూగివచ్చుచుంట
నాకలియెట్టిదో? యెఱుగరు ప్రజలపు । డార్యావర్తమున ॥భార॥

—( మధ్యకాలపు పౌరాణికయుగము )—

స్వార్థము క్రమముగ మనుజుల బుద్ధుల । నాక్రమించుకొలది
సత్యము క్రమముగ మనుజులయందున । సన్నగిలెనుకొలది
వేదములకు సంకుచితదృష్టి క । ల్పింపబడియె, నందే?
కోట్లమానవులు వేదబాహ్యులుగ । కోరిచేయబడిరి,

వారినార్ష విజ్ఞానపు భాండా । గారముపొంతకును,
శాశ్వతంబుగా పోనివనట్టివి । శాస్త్రంబులుఁ పుట్టె
అయ్యయొ? యజ్ఞానాంధకారమున । నధికజనుల ద్రోసి
విపరీతార్థము వ్యాఖ్యానములలో । విస్ఫురింపజేయు
నుచ్ఛనీచతలు జన్మచేతనే । యుత్పన్నంబయ్యె,
అప్పటినుండియె, వేదమతమునకు । నగచాట్లొచ్చెనగా
ప్రకృతినైజమును సహజసిద్ధమగు వర్ణధర్మమునకు
నతిపవిత్రమగు వర్ణవ్యవస్థకు । పతనస్థితియొదవె? ॥హిం॥
పౌరాణికయుగ మంత్యమగుసరికి । పలునూర్పులుగల్గి
హిందూమతమే తునాతునకలై । యార్యావర్తీయులకు
కలహంబులకును యుద్ధంబులకును । కారణమయ్యెనయా?
ఆధునాతనయుగ ప్రారంభములో । నంతర్యుద్ధములు
పెరిగిపోయె! మత, మకట? చీలికలు । పీలికలై పోయె;
పరమతస్థు యిస్లామీయులు । భారతదేశమును
కొల్లగొట్టియును, కడకు ప్రభువులై । కొన్నాళ్లేలిరయా?
అంతట హిందూ, యిస్లాంమతముల । యంతలిజగడముల
కారణముగ పా, శ్చాత్య దేశజుల । కైవసమైపోయె, ॥భార॥

—( అధునాతన దేశకాలపరిస్థితులు )—

పరదేశీయుల పాలనలోబడి భారతదేశంబు
బానిసత్వమున మ్రగ్గుచు క్రమముగ । బలహీనంబయ్యె
దేశీయంబగు సర్వవృత్తులును । నాశనమైపోయె,
పరదేశపు వస్తువులు వస్త్రము, ల । పారముగా వచ్చి
పడుటచేత గ్రామీణ వృత్తులును । భగ్నంబైపోయె

కాయపరిశ్రమను యంతపరిశ్రమ । కాలదన్నివైచె,
యంత్రశక్తి భరతోర్విఁ నెగడుటకు । నాంగ్లప్రభుత్వంబు
సవతితల్లివలె శీతకన్నుతో, నవలోకనజేసె
అలప్రభుత్వ పరిపాలనశాఖల । యందన్నిటిలోన
ప్రజలకు హితమగు ఫక్కిని సంస్కా- । రంబులేనికతన
నలిగి చచ్చుచున్నారు, జనంబులు । పలువిధములుగాను,
వాయువులేని ప్రదేశము గన్గొనవచ్చునేమొగాని
లంచగొండి కానట్టిశాఖలం । దెంచిచూడ లేవు, ॥భార॥

భారతవర్తకమున ముప్పాతిక । పరపతి పాలకులౌ,
శ్వేతజాతులదెయౌట, వారుమన । క్షేమముగన్గొనక
స్వార్థలాభమునె జూచుకొనుటచే । నార్థికంబుగాను
దేశైశ్వర్యము నానాటికి దిగ । దీసిపోయెనయ్యో?
అతికఠినంబగు నటవిశాసనం బమలుజరుగుకతన,
పశువులు సేద్యపువృత్తియు పల్లెల । పలుచబడుటకతన
కలయజూడ నెల్లెడల నాకటికి । పలువరించువారే?
ప్రకృతిమున నెటుజూచిన ధనికపిపాస । యొగన్నుపాలను
దారిద్ర్యము దేశంబున నెల్లెడ । తాండవించుచుండె
విద్యాజ్ఞానము శూన్యంబయ్యెను । వివిధనరులలోన ॥భార॥

వృత్తిని మరియొక వృత్తిదోచుటకె । యెత్తువేయుచుండు
పూర్వాచారపు నెపమున నరులను । బుట్టలోనవైచి,
ధనములాగుటకె మతము శాస్త్రమును । వినియోగింపబడెన్
దైవము పేరట మతముపేరటను, తాంత్రికముగనిప్పు,
భావదాస్యమున, కర్మదాస్యమున బంధింపగబడియు

కులాచారముల గోతిలోపలను కూలినావునీవు,
నిజముగుదైవము? నిజముగు మతమును । నిజముగు గురువిపుడు
'నాస్తి' 'నాస్తి' యని ఘంటాపథముగ । నమ్ముము? యువ
కుండా? ॥హిందూ

# ప్రబోధము

నిజమగు దైవము నిజమగుమతమును నీవు తెలుసుకోనవా?
నీయాచారము నీధర్మంబును నీవు తెలుసుకోనవా?
నీవాకిలి నీవృత్తిని నీవెటొ నిలబెట్టగ రావా?
నీదేశమునకు నీమతంబునకు । నీవు సేవవిడవా?
లే? లే! యింకెట వైశ్యాయువకుడా? లెమ్ము నిద్రనుండి
కన్నులు తెరచియు విశ్వమునంతను । కలయజూడవోయి?
అరరే! యెంతటి ఘోరదాస్యమున । నణగియుంటివోయి?
వహ్వారే! యెంత విచిత్రభ్రాంతిలో బడియుంటివినీవు?
మూర్ఖమునింగిటి వింతదనమ్ము । సమ్మోహన మంత్రమున
అల్లదె? చూడుము? జ్ఞానభాను । డంతంతనపొడచూపె?
అజ్ఞానంబను చీకటిగుంపును । సుజ్ఞానజ్యోతిక
పటాపంచలై పోవునట్లుగను । పారద్రోలుము య్యా
తేరుకొనుమయో? భారతపుత్రా? దిటవుపఱచి మనసు.
హైందవసోదర? వేదదివిటి నీహస్తమందుదాల్చి
పరిసరములు తిలకించుచును, ముందుకు పోజూచిపోమ్ము॥ భార॥

# — మానవశ్రేయము —



కథ:—

సర్వలోక కళ్యాణము మొదటిది । సరిగజూడుడయ్యా
మానవ సౌభ్రాతృత్వమె తారక । మంత్రమహాత్ముసుండీ?
విశ్వమానవ ప్రేమేనండీ? విశ్వేశ్వరుపూజ?
అత్యుత్తమమగు గుణమది లేకనె । యువనీతులనుందు.
గతశతాబ్దముల చారిత్రంబును । గమనించిచూచి.
యొక దేశంబును మఱియొక దేశం । బొంచివేయదలచి
యొక్క మతంబును మఱియొక మతమెట్లో యూర్చివేయదలచి
జాతి దురభిమానంబును మఱియొక మతమెట్లో యూర్చివేయ
[దలచి

జాతిదురభిమానంబున మఱియొక । జాతినణపదలచి
దుర్బలమానవ గుణసంపత్తిని । దోచుకొనగదలచి.
రక్తపాతములు, ఘోరయుద్ధములు । రగులుకొనెనయ్యా
శాంతిభద్రతలు సౌఖ్యజీవనము । నసుసిపోయెనయ్యా?
మానవమూర్తిని ముఖ్యలక్ష్యమే । మాసిపోయెనయ్యా ॥భార॥

ముమ్మరంబుగా నగ్నిగోళములు । గ్రుమ్మరించినపుడు.
విషపూరిత వాయువులాకాశమున । విడచివేయునపుడు.
సజ్జనదుర్జన భేదము లేకను సర్వమానవులును
ఉన్నవారు, లేకున్నవారలును నొక్కుమ్మడిగాను
ప్రాణములఅచేతులను బెట్టుకొని । పరితపించిరయ్యా?

మంచిచెడ్డయను విచక్షణున్నదే? మారణయంత్రిము నా
యుద్ధపరాఙ్ముఖులగు సామాన్యుల । కొదవదె నాశనము?
పట్టణంబులును పల్లెలుగూడను । పాడుపడగ లేదె?
సస్యశ్యామలమైన పొలములును । సమసిపోన లేదే?
జాతీయంబగు సిరిసంపదలు । జారిపోవ లేదే?
వ్యక్తులహక్కులు గుళ్లుగోపురా । లవనిగలియ లేదే?
తిండికిలేకను కోట్లమానవులు దిగులుపడగ లేదే?
ఘోరదరిద్రమునందున రయితులు । కూలిపోవ లేదే?
యుద్ధయంతటను ఘోరపరిస్థితు । లుద్భవించుటకును?
మూలకారణం బేదియొకన్గొన । జాలరె యీయువకుల్ ॥భావి॥

వచ:-మానవశాంతి భద్రతా కంటకములగు నిట్టియుద్ధములన్నియును, నరులలోగల పరస్పర యీర్ష్యాసూయలవల్లను విశ్వమానవ కళ్యాణకాంక్షా రాహిత్యములవల్లనే సంభవించుచున్నట్లు చరిత్రలవలన రుజువగుచున్నదిగదా? అట్టిచోవిూరు?

కథ:-

విశ్వమానవ శ్రేయముగోరుట విద్యుక్తముగాదా?
జన్మచేత నీయఖిలమానవులు సమమేయాగాదా?
మానవులందరు నొక్కజాతియని మదికిదోచ లేదా?
అంతర్బహిరింద్రియములు నందఱి । యందును సమమే గా?
పుట్టుకలోనే యున్నతశ్రేష్ఠతగా । బుట్టినవాడెవడు?
శక్తియుక్తులను సామర్థ్యంబుల । సామ్యము లేకున్న?
మాత్రంబుననే భిన్నజాతులుగ మనుజుల నెన్నెదవా?
బండిగుఱ్ఱములు, స్వారిగుఱ్ఱములు, పంజాబ్ గుఱ్ఱములు

నన్నియు నొక హాయి జాతికి చెందిన । వని తెలియగ లేవా?
యింతమాత్రమైనా విశాలదృష్టిని । యెనయనైతి వేని
హెచ్చుతగ్గులను హ్రస్వదృష్టితో నెన్నదలచితేని.
లక్షలశాఖలు నరులయందునను వీక్షించితి మేని.
కోట్లజాతులే మనుజగణములో గోచరించె నేని
సమరసభావము లేక పరస్పర సంఘర్షణాల్గి
శాంతిసౌఖ్యములు మృగ్యంబై ధర । జనులు నశించిపోరే ॥భా॥

కావున ప్రప్రథమంపు ధర్మమా । గాదె విశ్వప్రేమ?
తనుపరి దేయగు దేశప్రేమయు । తిథ్య-బీమాటు?
విశ్వశ్రేయము భంగపఱచు దే । శైశ్వర్యంబేల?
జాతిదురభిమానంబున " హిట్లరు" జర్మను దేశజులు
పుడికొల్పియు లోకంబు నెమరొల్చని । యుద్దగించిన దేమి?
బలహీనపు దేశములను పొడిసియును । పాశ్చాత్యులు నేడు
తెగనాఢించిన ధనకనకంబులు । మిగిలించిన దేది.? ॥భా॥

వచ:-కాబట్టి లోకమంతయు శాంతి సౌఖ్యములతో వర్ధిల్లుము, తన దేశముగూడ స్వాతంత్ర్య శాంతి సౌఖ్యములతో సరితూగవలయునని కోరవలయునే కాని, తక్కిటి దేశములన్నిటిని దోచుకొని తన దేశముమాత్రము సిరిసంపదలతో నిండియుండవలయుననియు, పర దేశములన్నియు తన దేశమున కుండిగము నల్పుచూ. స్వేచ్ఛాస్వాతంత్ర్యములు లేకుండా యుండవలయు ననియు, కోరుట తగదు. తన దేశీయులు మాత్రమే లోకపరిపాలనార్హతగల స్వచ్ఛమైన "ఆర్యజాతి" యనియు తదితర దేశీయులందరును, పాలించబడగల 'అనార్య' జాతియనితలచి

తన దేశము యెడలనైన దురభిమానము వహించుట మొదటికే తగదు. ఏలనన:- లోకాక్రిష్టాగరముగు పద్ధతిలో స్వదేశమును సంపత్సమృద్ధ మొనర్చినను, ఒకానొక కాలమున, పరిసర దేశములన్నియు నేకకూటముగా నేర్పడి యెదురుతిరుగకమానవు. అప్పుడు స్వదేశమునకు నికృష్టగతియే సంప్రాప్తించును.

## దేశసేవ, స్వమతసేవ, సంఘసేవ.

కథ:-

మానవ కల్యాణాంతస్థ్యాగం । బైన దేశసేవ

ముత్కృష్టంబగు ధర్మమ్మనుండీ యునక స్థైర్యులారా?

స్వమత శ్రేయము గోరచేయుటయు సద్ధర్మమే కాని

దేశశ్రేయ విరుద్ధమా మతా । వేశము వలదండీ

స్వమత దురభిమానంబును వేగమె । వదలుట మేలండీ!

సర్వమతంబులు సమానమని తలచుట । సౌఖ్యావహమండీ?

మతవైషమ్యము లెప్పుడు దేశమును । హాతి మొనర్చునండీ

హైందవమత మభివృద్ధికి దెచ్చుటయందు నిమగ్నులరై

కృషిసల్పుటలో వర్ణద్వేషపు విషము చిలుకకండీ?

మతమును బలహీనంబొనరించెడు మార్గములనువదలి

స్వమతవృద్ధి నొనగూర్చెడు సాంఘికచర్యలు జరపండీ?

సోదరవర్ణము కపకృతిజరుగని చొప్పున నడువండీ! ॥హిం

స్త్రీయసఘమును, సంస్కరించుటలో । సేవలు జేయుటలో

సాంఘికముగు నభివృద్ధి గూర్చుటలో । జంకుగొంకులేక

నద్భుతగుణ నేవ్యక్తి నైన నెదురొడ్డి నిల్వరించి,

స్వార్థము వీడియు సాంఘికసేవలు సలుపవలయునండీ? ॥వైశ్య

ఓరిమితోడను ముందుకుసాగుము యువకవైశ్యులారా?
వాగాడంబర మెప్పుడును వలదో వైశ్యయువకులారా?
కార్యరూపమున వనిసడుపగవలె । నార్యవైశ్యులారా? ॥వైశ్య॥

## కర్తలాచరించుటలో యింగితజ్ఞతను బుద్ధి విచక్షణ నుపయోగింపుడు.

కథ:-

దైవపూజలును, మతసాంఘికములు దానధర్మములును
నిత్యకృత్యములు నాచారంబులు నెరవేర్చుటపట్ల
నుత్తమమగు మీబుద్ధిబలంబును యుపయోగించండీ!
మంచిచెడ్డలను గమనింపకనే "మామూలని" మీరు
కండ్లుమూసుకొని పాతపద్ధతినే గడిపివేయకండీ?
శాస్త్రదృష్టమును, పూర్వాచారము, సరిగాతెలుసుకొని
దేశకాల పాత్రంబుల కనువగు తెఱగున సవరించి
యింగితజ్ఞతయు బుద్ధివిచక్షణ హేతువులనుగూర్చి,
యాచరింపుడీ సర్వకార్యముల । నార్యవైశ్యులారా? ॥వైశ్య॥
శుశుమార చక్రమున సూర్యుడు చుట్టుతిరుగుననుచు
మేరుపర్వతముచుట్టును సూర్యుడు కొంచతిరుగుననుచు
శాస్త్రములో నొక వాక్యార్థంబును చదివిచెప్పనంత
గ్రుడ్డిగ దానినె నమ్ముకొనుటయును । దొడ్డతప్పుగాదా?
సందర్భా సందర్భములన్నియు చక్కజూడవలదా?
ఆదియుగంబున నుత్తరధ్రువమున నార్యులుండిరయ్యా?

తదుపరి తుహిన ప్రళయగల్గిన । తత్క్షణమున వారు
దక్షిణాపథము బట్టియు భూమ । ధ్యపు దేశంబులకు
వలసలు వొచ్చినయట్లు చరిత్రల వలన విదితమౌను?
అచ్చటి ప్రకృతియు నచటి ప్రవర్తన । లిప్పటి కర్మలును
గుర్తుపెట్టుకొని శాస్త్రంబులలో కూర్చి వ్రాసినారు
ఉత్తర ధృవ మండలమున నుండియు । నొప్పుగ పరికింప
దిఙ్మండలమును చుట్టుచు సూర్యుడు తిరుగుచున్నయట్లు
దృష్టిగోచరంబగుట శాస్త్రముల నిట్లు వ్రాసినారు
యింతమాత్రమున నీవిషయము సి । ద్ధాంతము జేసెదవా?
రైలుబండిలో పోవువారికిని ప్రక్కలగల చెట్లు
పరుగిడు నట్లగపడినమాత్రన ని పరమసత్యమౌనా?
దేశ కాలముల సందర్భంబును । తెలిసికొనగవలదా?॥ భావి॥

వచ:-ఉత్తర ధృవమండల విషయములన్నియు బాల గంగాధరతిలకుగారు వ్రాసిన "వైదికనిలయము" అను గ్రంథమున వివరింపబడెను. ఆ గ్రంథముయొక్క తెనుగు తర్జుమా గూడ 'వైదిక నిలయ' మను పేరుతో ప్రచురింపబడియున్నది. మరియు ఉత్తర ధృవమండలమున 48 రోజుల పరిమితిగల యుషఃకాలమున్ను, 47 రోజుల పరిమితిగల సంధ్యాకాలమున్ను గలిగియుండును.

కథ:-

ఆరుమాసముల రాత్రియుండు పగ । లంతేయుండు నచట
నెత్తికిసూటిగ ధృవనక్షత్రము । నింగినుండు నచట

ఆనక్షత్రపు కాంతివల్లనే । యతిదీర్ఘపు నిశిలో
నిత్యకృత్యములు జేసికొనెదరా । నెలవున జనులెల్లా
భూమధ్యంబున నుండు వారలకు పొసగవు పైకథలు
కావుననే ధృవప్రాంతంబును స్వ । ర్గముగ బోల్చినారు
యచ్చటివారిని దేవతలనియును । మెచ్చజెప్పినారు.
మనకొక వత్సరమైన వారికొక దినమేయనినారు ॥హైం॥

వచ:-మేరుబూధరము భూమియొక్క నడిబొడ్డుపైనున్న దనియు అది యత్యున్నతమైనదనియు, నందు స్వర్గలోకము కలదనియు దేవతలట నివసింతురనియు, అందు శింశుమార చక్రంబు గలదనియు దానిచుట్టును సూర్యుడు తిరుగుచుండు ననియు, పూర్వాచార పరాయణులు చెప్పుమాటలనుగాని పౌరాణిక కవివర్ణనలను గాని, గుడ్డిగా నమ్మక వివేచనా బుద్ధితో శాస్త్రార్థములను దేశకాల పరిస్థితులతో సమన్వయించి చూచినయెడల వారుచెప్పే స్వర్గము భూమిమీదనే యున్నదిగాని యాకాశమున లేదనియు, ఆ దేవతలో కానొక ప్పుడు ధృవమండలమున నివశించిన మనుజులేననియు అచ్చటి దినప్రమాణాదులు మానవాతీతమైనవిగాక భూగోళ పరిస్థితి ననుసరించిన వేననియు, తెలియుచున్నది. అచ్చటి దేవతలు జరామరణాదులు లేని యమర్త్యులనియు, నచట రంభాద్యప్సరస లుందురనియు చెప్పుకల్పనలు కేవలము పిట్టకథలు వుత్తర ధృవమున రెండుమార్లు హిమప్రళయము గల్గుటచే, నది జీవులకు నివాసయోగ్యము కాదు గనుక నచ్చట యిప్పుడెవ్వరును లేరు.

కథ:-

ఈవిధంబయిన మూఢనమ్మకము లింకెన్నో గలవు.

2 గ్రహణ కాలముల రాహుకేతువులు । గహ్వారిములు [దెఱచి

3 సూర్యచంద్రులను మ్రింగుచుందురను । సూక్తులు నమ్మెదరా?

4 చంద్రుని మాటటులుంచుడు । యీ భూ చక్రంబున [కంటే

5 యెన్నియో లక్షల రెట్లు పెద్దదై । యున్న సూర్యగోళం

6 బును మ్రింగుట కా రాక్షసుడెంతటి । తనువుగల్గువాడో

7 అట్టి రక్కసుని పట్టువదల్చుట । కలవియె నరులకును

8 స్నానము జేసియు, నర్ఘ్యంబిడగనే । జడియునె రాక్షసుడు?

9 జపములు మంత్రము లంతటి ఘటనను । సాధించునె? చెపుడీ

10 గ్రహణాంత బును పుణ్యకాలముగ । గణుతించి యుమీరు

11 పితృతర్పణాల్ జేసి దానములు । విప్రుల కిచ్చుటయు,

12 సంగట్లా సమారాధ నన్నటుల । నుంది గాదటయ్యా?

13 గ్రహము లవెక్కడ? రాక్షసు లెక్కడ । గ్రసియించుట [యెచట?

14 భూమినీడ గాక గ్రహణములకు పుట్టు వొండు గలదా?

15 భౌతిక శాస్త్రజ్ఞులు ఫోటోలను । బహు నేర్పుగ దీసి

16 రాహుకేతువులు మ్రింగుట కాదని । రహి దేల్చగ లేదా?

17 యిటులనె యింద్రధనస్సున పిడుగున । కెన్నో కథలు [గలవు

18 యిందు కెక్కడా! రథము గుఱ్ఱముల । నెక్కి తిరుగు టేడ?
19 నవమేఘంబుల కథి గాఢుండై నడిపించుట యేడ?
20 వహ్వారే । యూతని చేతిలో ధనువే పరదగూడటంచు,
21 ఆరథచక్రపుచీల యూడుపడుటదియే పిడుగంచు,
22 చెప్పినంతటనె, నమ్మెవారల । చెవులుగోయవలదా?

సహజముగా కవులు ఒక్క యంశమును చూచాయగా నాధారము చేసుకొని యనేక యంశములను కల్పించి వ్రాయుదురు, అంతమాత్రమున నందలి ప్రతి యక్షరమును పొల్లు బోకుండా సత్యమని నమ్ముట యింగితజ్ఞతగాదు.

మరియు పురాతన కాలములో మేధావులగు పండితులు హిందూమతము యొక్కయు, వర్ణముల యొక్కయు, ధర్మములను పలుమారు మార్చినపుడెల్ల, యిటు రాజశాసనము చేతను, అటు పురాణగాథా ప్రబోధము చేతను, ప్రజాసామాన్యమును లొంగదీసి వారికనుగుణ్యముగా ప్రవర్తిప జేసుకొనుటకై యనేక నడమంత్రపు గ్రంథములు వ్రాసిరి ఆ గ్రంథములలో దైవము పేరట, మతము పేరట, ప్రజలకు మూఢభక్తి కలుగజేసియు, స్వర్గనరకములను లోకములను సృష్టించి, యింద్రుడు యముడు మొదలగు దేవతాధిపతులను గల్పించి, ప్రజా సామాన్యమును భయపెట్టియు, లొంగదీసికొనిరి. ఇట్టి ప్రాతకాలపు కథలనే యీ కాలమునగూడ అక్షరాల నమ్ముట తగదు. ఇది మీా పురోభివృద్ధికి గొప్ప నిరోధము.

# సనాతన వర్ణవ్యవస్థ—వర్ణభ్రష్టత.

గీ॥ విశ్వమానవ ప్రకృతిని వివిధగతుల
తఱచిచూచిన త్రిగుణముల్ దనరుచుండు
సాత్వికము, రాజసము, తామసంబులనగ
వాని సంయోగములె కావి వరలదొండు.

కథ:-

సాత్విక గుణమే ప్రధానముగ గల జనులే బ్రాహ్మణులు
సాత్విక రాజస గుణసమ్మిశ్రిత జనులే క్షత్రియులు
రాజసతామస మిశ్రితమగు గుణరంజితులే వైశ్యుల్
తామస ప్రాధాన్యంబగు గుణవర్తనులే శూద్రులును

వచ:- వేదకాలమున మానవులయొక్క గుణవృత్తిభేదములను తెలుసుకొని వ్యవహరించుటకై చాతుర్వర్ణములు పలుకరించుచుండెను. అవి యీకాలమున, నమలులోనున్న బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రకులములు యెంతమాత్రమును కావని పరిశ్రమమున తెలుసుకొనవలయును. వర్ణములకు గుణకర్మములే ప్రధానములు. అవి ప్రకృతి సహజమైనవి. సత్యమైనవి స్వతస్సిద్ధమైనవి. కులములు! పుట్టుక ప్రధానమైనవి, కల్పితమైనవి, మానవ సహజ ప్రకృతికే విరుద్ధమైనవి.

కథ:-

సత్యము కరుణయు జ్ఞానము తపమును క్షమ మౌనమునందు

గనుపనునో యాతండె బ్రాహ్మణుం । డని వచింపబడెను,
శౌర్యము, తేజము, ధృతి, విక్రమమే । జనునియందు గలదో
యాతడె క్షత్రియుడని సనాతనులు వ్యవహరించినారు,
వాణిజ్యంబును, కృషి, గోరక్షణ, । వర్తకవృత్తులను.
ప్రాధాన్యంబుగ గలవారెల్లరు వైశ్యులనగబడిరి,
కాయకష్టమును పరిచర్యాత్మక । కర్మలె ముఖ్యముగా
నవలంబించినవారలు శూద్రుల । టంచు జెప్పబడిరి ॥హిం॥
ప్రకృతి యంతయును గుణత్రయముతో బరగియున్నదండీ!
సాత్వికగుణమే యొక్కశాఖకును స్వంత ముల్లెగాదు,
తపముజ్ఞానమే వంశంబునకును । తాతగంటుగాదు,
సత్యము కరుణయు, శీలము లొక్కని । జన్మహక్కుగాదు
తామసగుణులే, వ్యక్తికి తెగకును । తప్పనిసరిగాదు.
సూతుడు మునులకు బోధజేయడే సూక్ష్మధర్మములను
ధర్మవ్యాధుం డుపదేశింపడె । తపసికి జ్ఞానంబు.
శ్రమజేసినవా డున్నతగుణ క । ర్మములు బడయవచ్చు.
సంస్కారముచే శూద్రులు పూర్వము సద్బ్రాహ్మణులైరి
వైశ్యులు, క్షత్రియు, లెందరొ బ్రాహ్మణ వర్ణస్థులైయిరి
విప్రులు కొందఱు గుణహీనతచే విధిగ శూద్రులైరి.
యెన్నటి మాటలో యేల? యిప్పుడో యన్నలార గనుడు!
సత్యము తపమును కరుణయు జ్ఞానము । శాంతులు గలవాడు
సాత్విక గుణభాసితుడు గాంధియే । సద్బ్రాహ్మణుడౌను.
శౌర్యోజ్జ్వలు డగు వరలజపతియే । క్షత్రియుండుగాదా?
ప్రతివ్యక్తియు సహజముగ శ్రేష్ఠమగు స్థితినే కాంక్షించు?

వ్యక్తిత్వము స్వాతంత్ర్యము మనుజున కాదినుండి లేదా?
ఉన్నత దశకును పోవుటకే మతమొప్పదనుటమేలా?
బోయడైన వాల్మీకి మహోన్నతి। పొందలేదె మున్ను॥హిం
గుణము కర్మమే యొక్కటియైనను గూడ లేనివారు
బ్రాహ్మణులము మేమని ప్రకటించుట పరిహాసము కాదా!
తండ్రి బ్రాహ్మణుండైన మాత్రమున తానుగూడనౌనా!
డాక్టరు కొమరుడు వైద్యము నేర్వక డాక్టరౌనటయ్యా!
ప్లీడరుకొడుకొక డక్షరాస్యుడై। ప్లీడరెట్లుతాను?
పూర్వాచారుల కీమతసత్యము పూర్తి తెలిసియుండీ
యలసనాతనపు వర్ణాచారం। బవగతమైయుండీ?
సంఘసంస్కరణ జేయువారలను చాలదిట్టనేల?
అధునాతన భావప్రచారకుల నాడిపోయుటేల?
వర్ణభ్రష్టులని గాంధివాదులను పజదిట్టగనేల?
వర్ణభ్రష్టులు వారో? వీరో? వర్ణ మింపుడయ్యా?
విస్మృతమై దేశంబున పోయిన వేదధర్మములను
క్షీణించిన వేదంబుల ఘనతను। చేతనైనవరకు.
విధిగ నుద్ధరించుటకై పూనిన వెంకటాచార్యవరుని.
చెడదిట్టియు ఘోరావమానముల జేయనెంచుటేల?
యజ్ఞముజేసిన లక్ష్మీనరసిం। హాచార్యులతోడ
వాదముబెట్టియు కోర్టులకెక్కియు వ్యవహరించనేల.
వేదనిరోధకు లెవరో మీరలు వివరణజేయుండీ వైశ్య॥
తననడవడికను తనగుణంబులను తానుసంస్కరించి.
యున్నతగుణ మత్యుత్తమ వర్తన నొదవజేసుకొనగ

ప్రతివ్యక్తికి సామాన్యపు హక్కు బరుగుచున్నదండీ.
దాని నిరోధించుట కెవ్వరికిని తరముగాదనుండీ. ॥హీం॥

వచ:-పూర్వకాలమున విశ్వామిత్రుడను రాజు తన క్షాత్రగుణ వృత్తములను సంస్కరించుకొని బ్రాహ్మణుడగుటకు యత్నించగా మధ్యవచ్చిన యడ్డంకుల నన్నిటిని కఠిన పరిశ్రమతో దాటి, కడకు బ్రహ్మఋషి యయ్యెను. అయితే తనకును నిరోధకులకును, కలిగిన కలహము కారణముగా పాప పుణ్యమెరుగని యమాయకుడగు హరిశ్చంద్రుని కొంప గూలి యతను దారాపుత్రులతో సహాపడరాని పాట్లు పడెను.

గీ॥ అనాతన కాలమునందుఁ నొక్క.
వర్ణమునగను ప్రత్యేకవర్గము నెకి
భావచే కానబడ దెందు బ్రాహ్మణాది
వర్ణములునాల్గు నొకయింట వరలచ్చు

వచ:-ఇందుకు తార్కాణముగ హరివంశము విష్ణుపురాణములలో చెప్పబడిన వంశక్రమమును గమనించుడు.

"ప్రతిరథునికొడుకు కణ్వుడనురాజు, అతని కొడుకు మేధాతిథీ: అతని వలన కణ్వాశను బ్రాహ్మణుడు పుట్టెను," (హరివంశము) "గర్గ్యుని వలన శని, అతనివలన గార్గ్యులును, శైన్యులునను క్షత్రియ వంశ్యులైన బ్రాహ్మణులు గల్గిరి. మహా

మహావీర్యునికొడుకు ఉరుక్షయుడు. అతనికి త్రియ్యారుణుడు' పుష్కరిణుడు, కపిలుడు, అనిముగ్గురు పుత్రులు తర్వాతవారు ముగ్గురును విప్రత్వమునుపొందిరి. బృహత్క్షత్రుని పుత్రుడు సుహోత్రుడు, ఇతని పుత్రుడు హస్తి ఇతడె హస్తినాపురమును కట్టించెను. అజమీఢుడు, ద్విమీఢుడు, పురుమీఢుడు, అనిహస్తికి ముగ్గురు కొడుకులు అజమీఢునివలన కణ్వుడును, కణ్వునివలన మేధాతిథియు అతని వలన కాణ్వాయనులను బ్రాహ్మణులును కలిగిరి''

విష్ణు పురాణము

కథ:-

జన్మచేత సర్వులును శూద్రులే సత్యంబిదియనిరి,
తదుపరి సంస్కారంబున ద్విజుల । య్యెదరని వాకొనిరి.
తండ్రి సాత్వికుండైనను తనయుడు । తామస మతియైన,
భ్రాత సత్వవం । తుండై తమ్ముడు । బద్ధపు కోరైన
భర్త శాంతిప్రియుడై, గయ్యాళియె పత్నిగల్గియున్న
కొడుకు హంతకుండైనను కోడలు । గుణవతియైయున్న
అన్నవణిజుడై తమ్ముడు వి లిబరి । యందుపదవినున్న
ఒక్క గృహంబున రెండు వర్ణములు । నున్నయట్లుగాదా?
ఒక్కకుటుంబములోనె త్రివర్ణము । లుండవచ్చుగాదా?
ఒరుల సేవచే బ్రతుకు కూలివా । డున్నత వర్తకుడై
యామీదట రాజ్యాంగపాలనం । బందు జేరెనేని,
ఒకడే మిక్కిలి వర్ణభేదములు నొందినట్లుగాదా? ।బాం॥

వచ:- కావున దశలబోలె మానవునియొక్క యప్ప టప్పటి గుణప్రవర్తనలను సూచించుటకు మాత్రమే సనాతన కాలమున యీవర్ణములు వ్యవహరింపబడు చుండెను, కాని జన్మతః మానవులయందు హెచ్చుతగ్గులు లేవు.

## ప్రస్తుత కులములు

వచ:-ఇట్టి మహాత్మ్యభ్రష్టమగు వర్ణ వ్యవస్థ కాల క్రమమున, నధఃపతితమగుటకు పూర్వాచార పరాయణు లే కారకులు.

గీ॥ మానవునివృత్తి గుణగతిమారుచుండు
వర్ణములునాల్గు స్థిరమైనవర్గములుగ
జేసి యందుచ్ఛనీచతల్ జెలగజేయ
నవియెప్రత్యేక సంఘముల య్యెపిదప.

కథ:-

సంఘ సంఘముల మధ్యహిమాచల శృంగంబులవంటి
యడ్డుగోడలను కట్టుకొనిరివా । రపరిశస్త్రముగను,
యన్నింటను నస్పృశ్యత దృఢముగ । నమలుపరచబడెను,
దృష్టిదోషములు శబ్దదోషములు । సృష్టింపగబడెను
పుట్టుకచేతనె హిందువులందున । పూర్వమైనయట్టి
ఉత్తమమధ్యమనీచాధమని । మ్మోన్నతములుగల్గె,
శాశ్వతంబైన తరగతిభేదము । సంఘటింపబడియె?
అంతర్భోజనములు నన్నింటను । యరికట్టగబడియె,

యంతర్వైవాహికములు ముందే । యంతరింపబడియె,
సహజంబైనమతైక్యత, వెంటనే । సమసిపోయెనయ్యా?
పైపెచ్చుగనంతర్వైషమ్యము । ప్రబలిపోయెనయ్యా? ॥వైశ్య॥
ఒక్కొకసంఘము నందునలెక్కకు మిక్కిలిగాయె తెగలు
శాఖలుఫణములు నుద్భవమయ్యెను । స్వార్థాంధంతవలన
కులకట్టులతో బిగింపబడెనయా । కులసంఘములపుడు
మొసలకుండగనుశాస్త్రసూక్తులతో । బిసువేయగబడియె
వ్యక్తిస్వాతంత్ర్యము, పాలుకునగూడను । నణచిపెట్టబడియె,
అటుయిటుమెదలిన వారినెల్లరను । నంత్యజాలుగ జేసి
పంచమకులమును సృష్టించియు, నం । దుంచిరివారలను
మతభ్రష్టులుగను కులభ్రష్టులుగను । మదినెంచిరివారిన్,
వినగూడనివా రంటరానివా । రనిదూరస్థులని
గ్రామబాహ్యులుగ జేసిరివారిని । కారుణ్యము లేక
శిక్షవేసినను దానికి పరిమితి । చెప్పవలయుకాని
ఆచంద్రార్కముశిక్ష వేయుటయు నన్యాయముకాదా?
తప్పొనరించిన వారినిమాత్రమె దండింతురుగాని
పుత్రపౌత్రపారం పర్యంతము పొడిగింతురె? యిట్టి?
యావజ్జీవపుశిక్షకంటెనిది । యన్యాయముకాదా?
మానవకంటకమిట్టిచర్యయని మదికిదోచలేదా? ॥హిం॥

వచ:- మనము స్వదేశీయులును స్వమతస్థులునగుహరి జనులనేజన్మతః పతితులనియెంచి, వారియొక్కసాంఘిక పురో భివృద్ధినణచి వేయుచున్నప్పుడు, విదేశీయులును పరమతస్థులు నగుశ్వేత ముఖులు మనలను నీచులుగా జూచుచు తమసరసను

గూర్ఖానులకుగూడ ననర్హులుగా నెంచుచున్నారని ఘోషింప నేల? మనలను వారుతమదాస్యమునుండి విముక్తినొందింపరే యని తూలనాడుటేల? దక్షిణాఫ్రికాలో భారతీయులను గ్రామ బాహ్యులు జేసిరేయని వగవనేల? ఆస్ట్రేలియాలో భారతీయు లను యడుగిడ నివ్వరేయనికుందనేల? తాటిచెట్టెక్కువాడొక డుంటె వాడితల దన్నువాడు మఱియొకడుండితీరుతాడు.

మనము హరిజనులకు న్యాయముకలుగ జేసినప్పుడు గదా? మనపైనధికారముగలవారిని న్యాయముపై పిలదీయుట? మన మహరిజనులను దాస్యవిముక్తినొందించినప్పుడుగదా? మన కుదాస్యవిముక్తిగలుగుట? మనతప్పులనము సవరించుకొనక యితరులతప్పులెన్నుటెట్లు?

## దేవాలయములు.

### సనాతన కాలములో నాటి పరిస్థితి

---

కథ:-

ఆసనాతనపు వేదకాలమున నార్యావర్తమున
బ్రహ్మాండంబగు గుళ్లుగోపురాల్ బాగుగ గట్టించి
కోవెలలందుశిలాప్రతిష్ఠలను గొప్పగ జేయించి
పండితపామరజనాకర్షణకు । పలువిధంబులైన
యుత్సవంబులును కైంకర్యంబులు నొప్పుగ జేయించి,
యదనుజిక్కినపుడెల్లనువారికి । నాధ్యాత్మికముగను,
మతవిషయముగను బోధలుజేయుట । మానకుండిరయ్యా!

జ్ఞానబోధలకు దేవళంబులే । స్థానమయ్యెనండీ?
గ్రామీయులకది యుమ్మడిహక్కై గ్రాలుచుంటకతన
సభలనుపన్యాసంబులచటనే । సాగుచుండెనండీ?
అవధానంబులు పండితగోష్ఠులు । నచటజరుగుచుండె
వార్తాప్రచురణ గ్రంథాలయములు । వరలుచుండెనచట
గ్రంథవిమర్శన గ్రంథసమీక్షణ । గలిగియుండునచట
సంగీతంబులు భజనలచటనే । సాగుచుండునండీ
శిల్పలచిత్రవిచిత్రకల్పనలు । చెలగుచుండునచట
గురుకులవిద్యాలయములచటనే । కొనసాగించబడుఁ
వర్ణాచారములను సరిందుటలోవచ్చువిభేదములఁ
ధర్మాధర్మవివక్షణజేసెడు । ధర్మస్థానమదే
హైందవసామాజికసుగుణలతల । నాలోచనజేసి
న్యాయంబొసగెడు పంచాయితులకు । న్యాయస్థానమదే!
ఇంతయేల ? హైందవులవిద్యలకు । హిందూకళలకును
హైందవనాగరకతకును మిక్కిలిహైందవమతమునకు
విజ్ఞానములకు నిలయములయ్యెను । వివిధదేవళములు ॥హిం॥

# ప్రస్తుత స్థితి.

కథ:-

ఇప్పుడు దేవాలయము పరిస్థితి । యెంతోహీనముయ్యె
మత, సాంఘిక, విద్యాప్రబోధమట । మచ్చుకైనలేదు
వైజ్ఞానికమునజూచిననదియు । ధ్వాన్నమయ్యెనేడు,

కులతత్వంబటజొచ్చి దేవతకు గూడప్రాకెనయ్యా!
అస్పృశ్యతయును దృష్టిదోషములు నతనికున్నవండీ
గర్భగుడిలోతనుతలుపు మూసుకొని । కనుపడ డెవ్వరికి
విప్రులకేతనదర్శన మిచ్చును వేరొకరికి, నిడదు
వుత్సవిగ్రహములుండు హద్దువైశ్యుండు దాటరాదు
ముందుమంటపముదాటిన శూద్రుని । ఛూత్కరించునతడు
సింహద్వారము ముట్టినహరిజను । ఛీత్కరించునతడు
తనయోజంట్లగు విప్రస్వాములె తననుతాకవచ్చు
వైశ్యాదులుతాకినచోశుద్ధికి । వంద 'ఫైను' పడును,
శఠగోపముకు కాణీవట్టము ! స్వామికివ్వవలయు
మంగళారతికిఁ బేడ ముడుపగా । మరిబేరము లేదు!
అష్టోత్తరశతపూజకు పావల । యర్చకునకుఫీజు!
సహస్రనామపూజకు రూపాయట, చొకకట్నమేను!
అభిషేకమునకు దక్షిణాంబరా । లాదులె లంచంబు!
పంచామృతముకు వకాల్తునొక । రూపాయేసుమ్ము
గ్రామోత్సవముకు కర్చులు గాకనె । కట్టడివతఘాయా
వాహ్వారె । యీవిధముగ దేవళమే వర్తకసంస్థయ్యె!
వర్తకత్వమొనరించు విప్రుడే । వ్యాపారిగమారె!
దైవపూజరూపాయలణాలలో । తాంత్రికముగమారె
డబ్బుగల్గుఛాదస్తులకేట యా। నబ్బుదైవపూజ
ఇహపరసాధన కియ్యదిమార్గం । బేమొ । తెలుపుడయ్యా?

---

# ఈశ్వరారాధనము మూఢాచారములు

---

కథ:-

సర్వశక్తియుతుడైన యీశ్వరుడు శక్తిరూపమునను
చరములచరములలో నభమందున । సర్వమందుగలదు
పంచభూతములయందా శక్తియే । బరగియున్నదండీ
త్రిమూర్త్యాత్మకంబైన శక్తియే దివ్యశక్తియండీ
ఆదిశక్తియన నయ్యదియేపరమాత్మ శక్తియదియే!
వాసవాంబయన నాదిశక్తియే । వైశ్యయువకులారా?
త్యాగశక్తి వైశ్యులలో జొనిపియు । తను త్యాగము జేసే,
ఆ మెయందుగల మహాశక్తినే । యారాధించండీ?
యన్నిగో వెలలనుండు ప్రతిమలిట్టు । లాదర్శమెనుండీ?
సర్వభూతహృద్దేశములందీ । శ్వరుడుగలండించు
గీతలలో కృష్ణుండు వచింపడె । క్రిడితోడమున్న
జడములకంటెను జీవులయందే । శక్తిప్రస్ఫుటంబు
జీవులకంటెను మానవులందే । చెలగుదైవశక్తి
అద్దములోమాలిన్యమురహితం । బైనకొద్దిప్రతిబిం
బముస్వచ్ఛంబుగ గన్పడునట్టులే । పరమాత్మయుగూడ
మనుజునిహృదయము పరిశుద్ధంబై । దనరుకొలదియందు
పరిస్ఫుటమైనరునంతర్దృష్టికి । ప్రతిఫలించుచుండు
సర్వమానవులుతనసంతతియే । సర్వులుతానేయా
శిష్టులీశ్వరుని ప్రేమకుపాత్రులు । దుష్టులుదూరస్థుల్
మానవసేవయె మాధవుసేవని । మదితెలియగలేవా?

జీవసేవయేయీశ్వరుసేవని । భావించగలేవా!
కారుణ్యంబిసుమంతయు లేకను । కర్కశహృదయులరై
దేవునిసంతతియగుజీవులనే । తెగనఱికెడివారు,
దీనమానవుల పీడించుటలో । తెగువగల్గువారు,
మోసపుమాటలచేతనులోకుల । గాసిపెట్టువారు,
ప్రాణిక్షోభరయొసర్చుటలోతమ । ప్రజ్ఞజూపువారు
ఒక్కనాడు దేవాలయంబునకు నొప్పమీరవెళ్లి
కాసువీసమును ఖర్చుపెట్టకనె । గడియించినయట్టి
చెంబెడు నీళ్లును తుమ్మిపూవులును శిలపైబోసియును
"హరహర" యనియుచ్చరణసల్పుట । యంతమాత్రముననె
పాపములెల్లను పటాపంచలై । పారిపోవునయ్యా?
లోకముకన్నులు మాయుటకొఱకే । గాక । యిట్టివారు॥
చేయుపూజ విపరీకంకమై । చెల్లునె యొందనను?
చేసినకార్యము లెయ్యవిపాపపు । చేతలోయని తెలసి,
ఘోరంబౌపరితాపదవానల కూపనుందుగాలి,
ముందుకాలమున నింగచేయనని । మొదటనిశ్చయించి,
ప్రాయశ్చిత్తముకొరకై యీశ్వరు । ప్రార్థించుచునెప్పుడు,
సత్కార్యాచరణంబున మనసును । సాగించినగాక,
సడలిపోవునే? చేసినపాపపు సంచయ మెవరికిని ॥హిం॥
మఱియొక తెగవారున్నారండీ । మనవైశ్యులలోన
నహరహమును లాభంబుగడించుట । యందేమగ్నులరై
సామాన్యంబుగ నేనియు విద్యలుచదువుకొననివారై
ప్రార్థనపదములో ధ్యానపదములో పఠియింపగలేక

భక్తితోడనీశ్వరుని నతించెడు పథము దెలియలేక
తాత్కాలికమగు వ్యాసంగంబున । తగిలి, తెలివిలేక
కాలవైపరీత్యంబున తనుకేగసిగల్గినపుడో
మఱియుశుభాశుభ కార్యంబులలో । మామూలుగవారు
దినకూలికివిప్రులను కొందఱిని ॥ దెచ్చినియోగించి
తమతరఫునవారలకు 'వకాల్తు'గ ధారటియొసగియును
అభిషేకంబులు సేవలుకైంకర్యంబులు జేయించి
దేవతలనుప్రార్థింపజేతురి । తీరునజడమతులై ॥వైశ్య॥

క॥ ధనమునాశించియును పర । ధ్యానమునను
శ్లోకములో! పద్యములో! కంఠశోషగలుగ
పరులచే వల్లెవేయించబడినమాత్ర
భక్తియో? దైవకరుణయో? బడయగలరే?

వచ:- మీరుస్వయముగా కట్టించుకున్న కన్యకాపరమేశ్వరీ దేవాలయములలోనె మీరు గర్భగుడిలోకి వెళ్లి, స్వయముగా పూజచేయుట కభ్యంతరము కలిగియున్నప్పుడు, తదితర దేవాలయములలో మీకుగలహక్కులు చెప్పనేల? శ్రీశైల, కాశీదేవాలయములలో సర్వులునుగర్భగుడిలోనికి వెళ్లి స్వయమారాధన చేయుట కభ్యంతరము లేనప్పుడు యితరలక్ష్మీ లాది దేవాలయములలో, గర్భగుడిలోనికి, విప్రులుతప్ప, తదితరులు. పోగూడదనుడలో సర్థమేమైనగలదా? కాశీశ్వర శ్రీశైలమల్లికార్జునులకంటే యీదేవతలంత యెక్కువపవిత్రులా? లేకయీగుళ్లలోని దేవతలకంటె కాశీశ్వర మల్లికార్జునులంత స్వల్పులా? ఇదంతయుస్థానిక పూర్వాచార పరాయణతయొక్క

దాష్ట్ర్యముగాక మఱేమి? స్వయమారాధనకే పలుకని దేవుడుం వకాలతు, యారాధనలకు పలుకుతాడా? దేవాలయము బ్రిటీషుకోర్టుగాదు. దేవుడువాదనతోను, చర్చలతోను, పలుకువాడును, కాడు. భక్తి, ధరకులభించునది కాదు. దైవకరుణావకాలతులతో పొందదగిన దిన్నికాదు. అయి తేతనకుతానై.

కధః-

పరమేశ్వరుఁడా శిలలోఁగలడను గురిమదిలోనుంచి
హృదయముభక్తిప్రపూర్ణంబై తానొదిగియీశునెదుట
నంజలిపుటుఁడై పరితాపముతో । నతిదీనంబుగను
ఘనపాషాణములైనను నిలువున । కరగిపోవునట్లు
నంతశ్శుద్ధిగ ప్రార్థించినగా । కతఁడుదయనుగనునె?

వచః- మఱియు పూర్వాచార పరులలో గలచాదస్త
మును వినుడు.

కధః-

తమలాభంబునకై లంచంబులు దైవంబునకొసగి
సంతృప్తిని గనువారున్నారే । సంఘమునందు నేడు!
వ్యాపారంబునపదివేల్ లాభము వచ్చినపక్షమున
టెంకాయనుకొట్టెదనని మ్రొక్కెడు వెంకాయలుగలరు!
ఒకతెప్పుడు దావాలో గెల్చినచో । నొప్పుగ దేవునికి
నుత్సవంబుసేయుంతుననెడు వారున్నారిపుడయ్యా!
లంచంబునకాసించి యీశ్వరుడు । లాభమొసగునయ్యా?
పసిడిముద్దలేకానుకగఁజెల్లిన । పక్షపాతియౌనా?

యుత్సవంబులకు భ్రమపడి దేవుండొప్పునె వంచనకు? ॥సై॥
రోహిణినక్షత్రంబునందు సోమ । రుండుగల్గనేని
వానిమేనమామకు నొకగండము । వచ్చునంచు నెంచి
శాంతియొనర్చుటకొఱకై బ్రాహ్మణ । సంతర్పణ జేసి
యొకవిప్రుని కపమృత్యుదానమిడు । టొకపిచ్చియెగాదా?
మరణంబును బదిలీయొనర్చు నా । మర్త్యుడొకడున్న
వాల్గుడబ్బులకె ప్రాణగండమును, నరుడెవ్వడుదీర్చు?
మిట్టిశాస్త్రములు చిలుముడబ్బులకె యేర్పడినవిసుండీ ॥సీ॥
జననియొజనకుడొచచ్చినవారలు స్వర్గపురికి జేర
నరుగుమార్గమున వైతరణీనది । యడ్డమున్నదంట!
విప్రునకును గోదానమిచ్చినను । వేగమె యాపితరుల్
ధేనువుతోకను పట్టుకనదినే । దాటబోయెదరంట!
గోవుదానంబొసగ లేనిచో గోదానపురుసుము
అయినపావులా లిచ్చినగూడను నాఫలమబ్బునట!
అహహా? యెంతటిమూఢ భ్రాంతిలో హైందవులున్నారు?

వచ:- మఱియు హిందూమతము యొక్క మూలగ్రంథములలో చెప్పబడినవైనను పూర్వాచార పరాయణులచే నుడువబడుచున్న కొన్నిమూఢ విశ్వాసములు గలవు వానిని వినుండు.

కథ:-

పడతులుస్నానంబొనరించియు న । శ్వత్థవృక్షమునకో
లేకున్నమహనుమంతుని గుడికో । వేకువనేబోయి

వక్కలుఖర్జూరాదిఫలంబులు వడిలోబోసుకొని
లెక్కించుచును ప్రదక్షిణంబులను । పెక్కుజేసినంత

.............................................

సంతతిగల్గునటంచు నమ్ముటయు । ఛాదస్తముగాదా?
మరియునుసంతానంబు పొందుటకు । మనహైందవులిపుడు
వేప, రావి, చెట్లకునొండొంటికి పెండ్లిచేయువారు
ములకచెట్లురెండింటిని జంటగ । కలిపియొకనిగ జేసి
పిదపవానికుద్వాహంబొనరిచి । ప్రీతిజెందువారు
ఒక్కరాతిపైనాగవిగ్రహము నొప్పుగ జెక్కించి
దానినిజలధాన్యాధివాసమున । దనిపియు, పిమ్మటను
నాగప్రతిష్ఠయొనర్తురనంతా । నంబుగల్గుటకును
అహహా! యెంతటి మూఢనమ్మకము హైందవులకుగలదు?
ఆరోగ్యంబగు శుక్లముశోణితమునందు మిళితమైన,
పిండకోశమే సరియగుస్థితిలో నుండియున్నయెడల,
ప్రకృతిసహజముగనే సంతానము । ప్రాప్తించునుగాదా?
ప్రకృతినైజమగు సృష్టిక్రమంబే । పరమసత్యమండీ!
అట్టిసత్యమే యీశ్వరసత్యం । ఔను । యువకులారా!

వచ:- హైందవులుచేయు మూఢపూజలు మఱికొన్ని గలవువినుండు?

కథ:-

కాయములోనే దేని యందు రోగంబుగల్గనేని
భౌతికమైనశరీరములోపల । ప్రకృతిసహజముగను

గల్గినదని వైద్యము చేయించుట క్రమపద్ధతిగాని,
తలనీలాలోనిలువునోపుంగో । తప్పక దేవునికి
కడువడితిరుపతిలో నిచ్చెదమని ముడుపులు కట్టెదరు
కొంతకుకొంతయొనర్చిన వైద్యపు । తంతుమూలమునవో,
సహజంబగు శారీరప్రకృతినో । జబ్బుతగ్గనేని,
దేవునియొక్కయనుగ్రహమనియే । దిటవుగనమ్మెదరు!
తక్షణమే తిరుపతికి వెళ్లియును తలగొఱిగించుకొని
బొడిగుండుపై చెప్పుదెబ్బలను । వేడుకతోదినియు,
తెచ్చినడబ్బును విప్రులకిచ్చియు । తిరిగివత్తురయ్యా! ॥హిం॥

వచ:- అట్లుగాక దేవునికిముడుపు గట్టుకొనిన మీఁదట గూడ రోగియొక్క రోగము పశమింపక,

కధ:-

జాడ్యము హెచ్చియు రోగిచచ్చినను । సంచితమనియెదరు
గతజన్మములో చేసిన పాపపు । క్రమఫలమనియెదరు
యింతకుమించిన మూఢనమ్మకము వెన్నియొగలవండీ? ॥వై॥
బాలికలెవ్వరలో నవయవవృద్ధిని బడయకున్నయెడల
యవ్వనప్రాదుర్భావము లోపం । బైయుండినయడల,
తనువుయొక్క సౌపుష్టవమభివృద్ధిని రో । ధకముగల్గునెడల
కాటేడుకుకోకలను పట్టెదను ॥ కాంతలుపిచ్చిగను
కాలముమించినగూడ రజస్వల । కానిముగుదలెల్ల
తులసిప్రదక్షిణములు జేయుదురెం । తోనమ్మకముగను
అంతటగూడను జబ్బుకుదర కు । న్నంత, తాయితలును

తంత్రంబులు దిగదీతలు గద్దెలు । తప్పకుండజరిపి
యావలభూతచికిత్స లొనర్పగ । నాశింతురె కాని
వైద్యముగాఢమొనర్పరు రోగము । ప్రబలిపోవువరకు

వచ:- మఱియు

కథ:-

సవతిదయ్యమై పట్టెనంచునొక । స్నానముదుప్పగట్టి
నాగులమీరాస్వామి యురుసునకునయమున్తోడబోవు
మూర్ఛరోగియగు ముగుదయొకతె తనమొక్కులు జెల్లింప
కాలేమస్తాన్ యుత్సవంబునకు గన్నవరెళ్లునయ్యా!
కొడుకుకుపిల్లలు గలుగ లేదనుచు । కోమలికోడలితో
నాసరయ్యతిరునాళకు వెళ్లును । దోషముతొలగునని
అచటవీరుస్నానంబు జేసితడి । యారనిబట్టలతో
తడితలలతో మతమందుజొచ్చియును । దండములిడగానె
పాపుకొళ్లతో నెత్తులమీదనె । పరిహరింతురుపీరీ
పిమ్మటవీరలు తెచ్చిన డబ్బులపీడవదలిపోవ
కర్మతొలగెనని తిరిగివచ్చెదరు కాంతలుగృహములకు ॥హిం॥

వచ:- ఇవిగాక గ్రామీణమూఢాచారములుసామాన్యముగ జరుగుచునేయుండును.

కథ:-

బట్టెగొడ్డుపాలివ్వక తప్పినప్రబలాంధోళనతో
పోలేరమ్మకుమీదుకట్టియును పొంగిలినిచ్చెదరు

పాలుదాగ్రివకను బిడ్డడేడ్చినను పాములపుట్టకును
పాలుతీసుకొని వెళ్లినాగులను పార్థనజేసెదరు
పైగానాగులపేర్లుపెట్టెదరు పసిపిల్లలకైతే,
కొంపలుగాలినచో నరసింహుడు కోపగించెననుచు,
శాంతియొనర్పుట కారగింపులను సలుపువారుగలరు!
కలరామొదలగువ్యాధులు వచ్చినగ్రామములో జనులు
శక్తులన్నిటికి రక్తమాంసముల భుక్తులొసంగియును
గ్రామదేవతలు గణాచార్లతో గలసివాటినెల్ల
సాగనంపుదురు పోలిమేరౌతలి । చోటిపట్టునటుకు ॥హిం॥

వచ:- భారతదేశములోని గ్రామము లంగన్నిటియం దును ముఖ్యముగ హైందవ మతస్థులగు, పామరులలో, జరుగుచుండినట్టియు, జరుగుచున్నట్టియు, మూఢములగు ఆచార పూజలకు కారణకర్మములు రెండునుకనుపడుటలేదు. శాస్త్ర సమ్మతిమునగాని యీ పూజావిధానములకు వివేకహీనతయే కారణముగానున్నది. ఏకైకమగు పరమేశ్వర తత్వమునకును, అసంఖ్యాకములగు క్షుద్రదేవతలకును సామ్యమెక్కడ?

కధ:-

రూపనామపరిమాణరహితుడౌ । నాపరమేశ్వరుడు,
వాంఙ్మానసముల కందకసర్వ । వ్యాపియైనవాడు,
అంతరాత్మలోనుండి ప్రబోధము కొంతజేయువాడు,
సర్వసాక్షియును సత్యరూపుడౌ సర్వేశ్వరుడెపుడు,
తనయులలోగల తారతమ్యమును తానైగమనించి

పరమపవిత్రంబైన హృదయము నె పాటించునుగాని,
యూరగింపులతో బోనంబులతో నతడు ప్రీతిగను నె?
రక్తమాంసముల భుక్తులతోడను రంజింపగబడు నె?
పెరటిలో జిక్కెడు పుష్పఫలములతో ప్రీతినొందడతడు
అష్టవిధములౌ పుష్పములున్నవి యాతనిపూజింప
అందహింసయే ప్రథమ పుష్పమౌ సందియంబు లేదు!
శాంతిదయాక్షమ సత్యాదులును సర్వోత్తమమైన,
పుష్పములనియే చెప్పిరి దేవుని పూజసల్పుటకును!

## హిందూమతము.

కథ:-

హైందవమతవృక్షమున నొక్కటే । అకట । త్రుప్పబట్టె
పుచ్చిన వేరును తీసివేయుటకు । పూని లేదు మొదట
దోహద మొనగుట కేనియు నెవ్వరు । దొరకొన లేదండీ
తరుమూలములో ప్రాకి యెదిగెనది । తదుపరిక్రమముగను
కొమ్మలు రెమ్మలు కళలుదప్పినను । గూడచూడ లేదు
ఆకులన్నియును పండుబారినను । నదిచూడగ లేదు.
కాయలుపిందెలు పుచ్చుబుట్టినను । గమనించగ లేదు.

గీ॥ గొప్పశాఖలుమున్ముందుచుప్పలంబు
బోయియెన్నడో పెనుగాలి । పోటువలన
మొదటికూకటివేళ్లతో । గదలిభూమి
ద్రెళ్లుటయు సిద్ధమంచని । తెలియుడయ్య

కథ:-

క్రైస్తవమత మొకవైపు తనవదన । గహ్వరంబు దెఱచి
హైందవమతమును గ్రమముగ గ్రసించెను । నవకాశమునుజూ
ఇస్లాంమత మొకదిక్కు నుండియు । నెంతో దౌష్ట్యముగా
అదనుజిక్కినపుడెల్లను మ్రింగుట । కాంచుచునుండ
మన దేవతలనె, మనమతంబునే । మదిలో నమ్ముకొని
మనము వారలను తిరుగుచుండినను । సమతవిధము లేక
నంటిపెట్టుకొనియున్న హరిజనుల్ । ఆరుకోట్లమంది
మనలోనుండియు జారిపోవుటకు । మది సైరించెదవా?
స్వసమైక్యతనే జారగవిడిచెదు । చవటధర్మ మేల?
స్వమతాంతః కలహముల బెంచు, యాచారధర్మ మేల?
యిప్పటి కేమనమత జలాశయము । యినికిపోయె చాల?
మతతటాకమున జేరెడునదులే । మఱలించగబడియె,
జలము హోరుమని తూములనుండియు । చా పోవుచుండె,
యిట్టులెమిన్నకయున్న తటాకము । వట్టిపోవునండీ?
వెనుక యోచనలు చేయుటయెల్లను । వెఱ్ఱితనంబయ్యా?
శుద్ధిసంఘములనెల కొల్పండీ । ఒద్ధిక గల్పండీ?

## తీర్థ యాత్రలు.

—— :: ——

కథ:-

తీర్థంబులలో నత్యుత్తమము గు తీర్థమె సత్యంబు!
జ్ఞాన, దయాదమ మింద్రియ నిగ్రహ దానార్జవములును,

శ్రేష్ఠమైన తీర్థంబులనుచును, జెప్పను! వేదములు,
పరిశుద్ధంబగు హృదయమెయన్నిట పరమతీర్థమయ్యా!
మానసికంబగు పూజయె శ్రేష్టం । బౌనీశునకయ్యా!
వేదంబులలో చెప్పినట్టిబహు విధకర్మములెల్ల,
సూక్ష్మబుద్ధితో నింగితజ్ఞతతో । జూచివివేచింప
నొక్క వాక్యమున 'సారసంగ్రహము' నొసగుచున్నవయ్యా!
"సత్ప్రవర్తనము నీదుగుణములను నీవుసంస్కరించి,
నిగ్రహశక్తిని గోల్పోవకయును, వ్యగ్రత జూపకను,
మంచితనముగా తోడిజీవితో మనుటే దేవునికి
ప్రియమగు పూజయు, కైంకర్యంబును, ప్రేమయుభక్తియును'

వచ:-మానసిక సంస్కరణము మానసికపూజలే సర్వ వేద ధర్మసారాంశమైనచో, ఇక, క్షేత్రయాత్రల వలనను, తీర్థసేవలవలనను, ప్రయోజనమేమని ప్రశ్నింతురేమో? రైళ్లు మోటార్లు మొదలగు ప్రయాణ సౌకర్యములు లేని యాపురాతన కాలములో యనేక దేశముల ప్రజలొకచోట జేరుటకును, వారివారి వేషభాషాచార నాగరకతలు పరస్పరము తెలుసుకొనుటకును, దూర దేశములు జూచుటకును, యాత్రిస్థలములందలి శిల్ప కల్పనలు, చిత్రకళాప్రదర్శనములు, తిలకించుటకును. మాత్రమే యుపయోగపడునని యుద్దేశించి కల్పింపబడినవి. అయితే వానిప్రయోజనము లెట్లున్నను, యాత్రికులలో కొంతకుకొంత మానసిక సంస్కారమైన జరుగుగాకని తలంచి, గయా ప్రయాగాది తీర్థములలో ప్రతియాత్రికుడును తనలోగల కామక్రోధాద్యహంకారములలో నొకదానినైన

వదలుకొనుటకు, అట్టి మహాపుణ్య తీర్థములయందు, ప్రతిజ్ఞ గైకొనుట యుత్తమమని మాదేశించిరి. ఆకాలమున నట్లే జరుగుచుండెను, కాని; యిప్పుడంతటి మనోనిగ్రహముగల యాత్రికులును లేరు, యాత్రాస్థలములన్ననో! కొల్లగొట్టు తన మానకును, కుతంత్రమాగథ సమపహరించు తంత్రజ్ఞులకును. కేంద్రములై యున్నవి.

కథ:-

ఇప్పుడు యాత్రిలు వెళ్లెడువారల । యితివృత్తముగనుడు;
మఱ్ఱి మాకు విస్తరిని ప్రయాగలో । మానితిమనువారు
గయాతీర్థమున వదలితి, మారెను । గాయ ననెడివారు
మదమెు, మత్సరమెు, క్రోధమెు, లోభమెు । మది విడువగ [వలయు
గాని, నిరుపయోగంబగు వస్తువు । గ్రన్నన వర్జింప
దేవుడు మెచ్చునె? లోకము మెచ్చునె? దీన నేమగలుగు?
యింతియెగాకీ యాత్రిలయందొక । వింతయేమిగలదు
యిక్కడ లేని పరాత్పరుండు మఱియొక్కచోట గలడా
అక్షరాల నాపూర్వపద్ధతులు । నాకాలంబునకే
పూర్వమానవుల ప్రకృతి కేతగి । పూజనమైనవయ్యె,
సామాన్యముగ క్షుధార్తి మెరుంగని । జనసామాన్యములో
నింతెకంటె పరమార్థసేవ లవు । జెమియు లేవయ్యె
పూర్వపరిస్థితు లిప్పుడు భారతభూమిలోన లేవు
“అన్నమన్ననో,” “రామచంద్ర” యని । యటమటించు [వారు

కన్నులకగపడు చున్నయట్టియీ । కాలంబునమీరు
క్షేత్రసేవయును, తీర్థసేవయును । శిలాసేవవీడి
చైతన్యముగల నరదేవతలకు । సాగించుడిసేవల్,
ఆర్తనాదములాలింగుడని చెప్పు । లందుబడుచునుండ
చేసినసేవను గమనించెడి యీ చేతనదేవతలన్
వీడియు, జడపాషాణదేవతల కూడిగ మొనరింప
న్యాయంబాసె? వివేకమాసె? ఓయన్నదమ్ములార? ॥హిం॥
మతమును వీడినవారిని తిరుగా । మతమునగల్పెడి
శ్రద్ధానంద మహర్షి యుద్యమము । సాగించగరండీ!
వేదవిధిగ వర్ణాశ్రమంబులను । వరలజేయుడయ్యా!
మతమునగల్గు విశాలభావముల । మననము జేయండీ!
సంకుచితంబగు మతతత్వంబును । చంపివేయుడయ్యా!
విశ్వదృష్టితో మతసంస్కారము విధిగ జేయుడయ్యా!
మతముదృష్టిలో వర్ణసంస్కరణ మూనక జేయుండీ

## అస్పృశ్యత

కథ:-

అస్పృశ్యతయను నాచారంబని । యతిబూటకము రయ్యా!
జన్మచేత నస్పృశ్యులు లేరీ । జగతీతలమందు
పిల్లులు కుక్కలు, మేకలు గృహమున కొల్లగదిరుగుచును,
సర్వవస్తు సంభారములంటియు చవిజూచినగాని
నీచ్చిన మాంసము నెత్తురు లెల్లెడ । చిందించినగాని

దోషము లేదే! పంచముఁడు కడప ద్రొక్కిన దోషంబా?
మడివస్త్రంబును గట్టుకొనినపుడు । మఱి భోజనవేళఁ,
గ్రన్నన నరహంతకుల నామములు విన్న నేమి లేదు;
గాని, హరిజనుని పేరువినినచో । గల్గునే పాపంబు? ॥వైశ్య॥
చాకలి తెచ్చిన యిస్త్రీబట్టలు సలిలపు బిందువులఁ
చిలకరించి, గైకొనుట కేనియు, ని । షేధమేమి లేదు!
గాని, గుడ్డ చెఱగ తనికి దగిలిన । కల్గునె దోషంబు?
మజ్జిగ శూద్రులవద్ద తెచ్చినను । మత దోషము లేదు!
ఆసుపత్రిలో మందులు దాగిన నది దోషము గాదు!
గాని, యందుపని జేసెడు తోటీవాని నీడ తగదా?
పైపులనీటిని మడికుపయోగిం । పఁగ వచ్చును గాని
జలమును 'ఫిల్టరు' జేయు హరిజనుఁడు । ఛండాలుండౌనా!
అవకతవక లీయాచారంబున నడిగినన్ని గలవు!
అవసరంబునను విధిలేనపుడీ । యస్పృశ్యత లేదే?
దొంగలు దొంగలు వూళ్లుపంచుకొని । దోచుకొనినయట్లు
అఖిలహరిజనుల నంటరాని వా । రని కడపటఁ బెట్టి,
ఒకరికంటె మఱియొకరు హెచ్చనెడు వికటపు వాక్కులను
పై కులములవారలు తరతమముగ । పంచుకొనిరి తమలో!
అన్యాయంబుగ నక్రమంబుగా నందిన గౌరవముల్
నిలువబోవయా! యెంతో కాలము । నిందాస్పదమిదియు,
పై పెచ్చుగ నిది యనర్థదాయక । మైపోయినదయ్యా!
సంఘవైరి! యస్పృశ్యత । దీనిని సమయ జేయుడయ్యా!
మతక్షీణతకు, కారణమయ్యెదె! సుతరాం, విడువండి!

సామరస్యమును జంపెగాన, పై । శాచికమిదియండీ!
దేశదాస్యతకు దారిదీసెనిది । దేశద్రోహమండీ!
యిట్టి నాశకరయాచారము మీ । రింక వదలుకోండీ? ॥హిం॥

## యువకుల కర్తవ్యము

కథ:-

బూజుపట్టిన నమ్మకంబులను । బుగ్గిలోకలుపండీ?
పూర్వాచారపు పాపపుకొండలు । పొడిపొడి చేయండీ?
'మామూల'నియెడు గుంటలోబడియు । మ్రందిపోవకండీ?
యువకోద్యమపు మహోజ్వలశక్తిని । యుత్తేజించండీ
యువకసంఘ నాయకుల ప్రబోధము । లోరిమితో వినియు
విజ్ఞానజ్యోతుల నెల్లెడలను । వెలుగొందగ జేసి
మీయింటిలో మీసంఘమతములో, । మీ దేశములోను
గాఢముగా వ్యాపించియున్న చీ । కటి బోద్రోలండీ? ॥భావి॥
గోపురములకును వెచ్చించెడు ప్రతి । రూపాయియుగూడ
విద్యాశాలకును కళాశాలలకు । వెచ్చింపుడు నేడు
వుత్సవంబులకు నూరేగింపుల । కొసగెడుధనమెల్ల
పఠనమందిరాల్ పుస్తకాలయాల్ । బాగుచేయనింపు
అభిషేకములకు పూజలకిడు ధనమంతయు మీరిపుడు
జ్ఞానసమితులకు దేశసంస్థలకు దానముగానిండు
పూజారులకు పురోహితులకు విప్రులకు నిచ్చుధనము
అన్నవస్త్రములు బీదలకిమ్చుటకై వెచ్చించండీ?
పాతపురాణ శ్రవణముమానియు జాతీయోద్యమపు

చారిత్రంబు సవిస్తరంబుగా చదువగ వినుదయ్యా!
తరుణోపాయము కొఱకై చేసెను ధర్మములన్నియును,
దాస్యమునుండి తరించుటకొఱకై ధారపోయుడయ్యా?
మానవసేవయె మాధవుసేవని మదిలో నెరనమ్మి,
సర్వత్యాగములు సర్వధర్మములు, సర్వదానములును,
సోదర మానవ సేమముకొరకై మోదముతో నిండు!
దేవునిదయ మీరెంతకోరెదరో దీనజీవులందు.
నంతటిదయ నే జూపవలయు నీ । యంతరంగముకోలది "వైశ్య!

ఉద్బోధము:-

లేలే యింతట వైశ్యయువకుడా । లెమ్ము మాంద్యముడిగి
యింతటిమూర్ఖను దెచ్చిపెట్టనీ । యంతటివాడేడీ?
అఖిలదేశ విప్లవముల కెల్లను అధినేతలె యువకుల్.
దైవముపేరట మతముపేరటను ధనముకొల్లగొట్టి,
బడుచుండుటకీ వైశ్యసంఘమే । ప్రబలకేంద్రమయ్యె!
అట్టితంత్రముల నిర్మూలన, నీహస్తమందుగలదు!
సాంఘిక సామాజిక జీవనమును । సంస్కరించిమిగుల
యెద్నదగిన ధర్మమునునడువ నీ । కన్న నిపుణులెవరు?
కరుమగట్టిరా, మాధసాంఘిక ప్ర । కర్మలకన్నిటికీ
యాచారములకు నమ్మకములకీ వంటేనే, భయము!
పౌరోహిత సామ్రాజ్యమునకు నీ । ప్రస్తాపనయే హడలు!
సంస్కరణజ్యోతిని హస్తంబున । చక్కగ ధరియించి
మీసంఘమునకు తేజశ్శక్తులు । మిక్కిలిగాగూర్చి
భావిభరత భాగ్యంబున భాగ । స్వామిగ జేయుమయా!

# యువజనోద్యమము

## ద్వితీయాశ్వాసము

## సంఘసంస్కరణ

గీ॥ ఆధునిక వైశ్య సంఘమునందు గల్గు
లోపములు సంస్కరించుటలోనమీరు
గ్రుడ్డియాచార పరులెంద । రడ్డుపడిన
చలన మొందక ముందుకే సాగుడయ్య!

వచ:-ఏ కాలము నందైనను, ప్రాతయాచార ధర్మమును విరమింప జేయునప్పుడును, క్రొత్తధర్మమును ప్రవేశ పెట్టునప్పుడును, ఆసంధికాలములో సంఘకల్లోలముదయించుట సహజము కాని, యీనూతన ధర్మములకు వచ్చినపిదప, నది యాకాలపు మానవప్రకృతికి తగియుండినచో తద్ధర్మసంకల్పులును, తత్ప్రచారకులును. లోకముచే మహాత్ములుగ బరిగణింపబడెదరు.

ప్రాతదగు సతీసహగమనమును తుదముట్టించునప్పుడు శ్రీ రామమోహన రాయలుగారినీ, వితంతూద్వాహమును సంకల్పించిన శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారినీ, ఆ కాలములో సామాన్యజనులెంత ఘోరముగ దూషించిరో,

ఇప్పుడు వారినంత మిక్కిలిగా కొనియాడుచున్నారు. గనుక వేదములయొక్క విశాలభావములను దృష్టిలో నుంచుకొని ఆయా కాలములకు తగినట్లు మానవుల సహజప్రకృతి ననుసరించి, యాచార సంస్కరణ జేయువారు ధన్యులే! ప్రస్తుత కాలమున అస్పృశ్యతను నిర్మూలించుటకే గాంధిమహాత్ముడు ఘోరతపస్సును చేయుచున్నాడు. మనము మనసోదరులను జన్మతః అస్పృశ్యులుగా నుంచియున్నంత కాలమున్ను ఐరోపీయ దృష్టిలో మనము అస్పృశ్యులుగనే పరిగణించబడి, దాస్యవిముక్తి పొందలేమని మహాత్ముడు ఘోషించుచున్నాడు. కాని, పూర్వాచార పరాయణులతనిని మతభ్రష్టుడని నిందించుచున్నారు. అయినను మానవప్రకృతికే సహజమైనదగు నాతని సిద్ధాంతము అమలుకు వచ్చినప్పుడు, అతనిని సాక్షాత్ ధర్మస్వరూపుడనియు. అవతార పురుషుడనియు, యీపూర్వాచార పరాయణులే వేనోళ్ల సంస్తుతింపక తప్పదు.

కావున, భావిభాగ్యము ననుభవించగల యువకులగు మీరు సంస్కరణోద్యమము, సాగింప నడుముగట్టుడు.

# విద్యాలోపము

కథ:-

సర్వదేశముల సర్వకాలముల ! సర్వమానవులకు,
ఆకలి, పిదపను గొప్పలోటు, వి । ద్యాభావమెసుండీ!
అట్టిప్రధానంబైన లోపమీ । యార్యవైశ్యులందు!

గాఢముగా నెలకొనియుండుట మీకన్నుల కగపడదా?
పశుపక్ష్యాదులకును మానవులకు । పరికించియుజూడ
భేదమేమియును గల్గదువిద్యా । విజ్ఞానంబులచే!
మాత్రమె నరుడధికుండగు! నవియే మనుజునందు లేవ్రా
య తడు జంతుతుల్యుండేయని మీమదికి దోచలేదా?
విద్యలేనిచో బుద్ధివికాస వి । వేకము లెటుగల్గు?
విద్యాహీనుం డిహపరములలో వృద్ధిగాంచలేడు,
పిత్ర్యంబగు ధనము సద్వ్యధిగ । వినియోగము కాదు.
సౌఖ్య శాంతులును కీర్తిప్రతిష్ఠలు । సాధింపగలేడు,
అవివేకున కాధ్యాత్మిక సౌఖ్యము నాస్తియగుట నిజము!॥వై శ్య॥

వచ:-విద్యావిహీనుడుగూడ, ధనసంపాదన చేయగల్గి యుండవచ్చునుగాని, అదియె మానవుని జీవితాధర్శముకాదు, అదృష్టముయొక్క పర్యవసానముగూడ, ధనార్జనమే కాదు. యశస్సు, ప్రజానురంజకత్వము, గౌరవపూజ్యతలు, తద్రీత్యా సుఖశాంతులు యివియే మానవునియొక్క యుత్కృష్టాధర్శములు. వివేకాదులు లేనివానిధనము వీనిని బడయజాలదు. పైపెచ్చు జనసామాన్యముయొక్క యీర్ష్యాసూయలకు కారణమగును. విద్యగలవాడో! వివేకాద్యుత్తమ గుణముల నలవరచుకొని, ధనసంపాదనముచేయ గల్గుటేగాక నైహికము గను, నాధ్యాత్మికముగను శాంతిసౌఖ్యముల పొందగలడు.

కథ:-

అక్షరజ్ఞానము గల్గుమాత్రమున । నదియు విద్యగాదు!
మాకువారికని పద్దులువ్రాసిన మాత్ర । నదియుగాదు,

పై పైమరి చదివిన మాత్రంబుననే బడయఁగలదేవిద్య?
శాస్త్రజ్ఞానము, మతవిజ్ఞానము । జ్యగతిజ్ఞానంబు
యిహాపర సాధకమగు వివేకమును । యింగితజ్ఞతయును,
కొంతకొంత యెరుంగఁగల్గుటే । కోరతగినవిద్య.
అట్టివిద్య మనవైశ్యులయందున । నంతగ కనపడదు ॥వైశ్య॥

ఉ॥ బాలుని పాఠశాలకును బంపినమీాదట నైదువత్సరాల్
కాలము చెల్లకుండనె, దు । కాణమునందున జేర్పనెంచి
"మాకేలను గొప్పయౌ చదువు । లెట్టిటొ చెప్పినదెల్ల
[వ్రాసినన్
జాలును; చిన్నపొత్తమును చక్కబఠించినజాలు!"నందురే
గోలయగిట్ట, దర్థమును కొండగఁబెట్టుటతప్ప వీరికిఁ ॥

వచ:- వైశ్య సంఘము ధనికుల కాకరమని ప్రశస్తి వహించి యుండియుఁగూడ సంఘములన్నిటి కంటెను సర్వవిధముల వెనకబడి, పురోభివృద్ధి గాంచలేకుండుటకు విద్యావిహీనతయే కారణమని బోధపడుచున్నది.

కథ:-

వేదవిధిగ షోడశకర్మలు గా । వింప బడెడునట్టి
యనుశృతమగు పద్ధతులను వీడుట । కును కారణమేమి?
సంఘమునను ముసఁగల్గు నవిద్యాజాడ్యంబునగాదె!
తిరుగ, వర్తమానంబున పునరు । ద్ధరణ జేసుకొనగ
నద్భుతగుణ ప్రత్యర్థుల స్వార్థుల । నణచుకొనగ లేక,
సంఘీయులలోఁగల యులసత్వము । సర్దుకొనగ లేక,

నజ్ఞానంబుతో గలుగు సందియము । లందు గొట్టుకొనుచు
ముందుకడుగిడగ జాలకుండుటకు । ముఖ్యహేతు వేది?
గొప్పవిద్య లేయున్న పురోగతి । కుంటుబడు నె? యిట్లు
కవులు పండితులు శాస్త్రజ్ఞులు సం । ఘమున గొల్లలుగను
లేక నరుడుగా నుండుటయును ప్రత్యేక నిదర్శనమే!
విద్యబొత్తిగా లేనివైశ్యులు వేనవేలుగలరు ॥వైశ్య

వచ:- మరియు రాచకీయాధికారమను యినుపగొను
పమునకు యీవైశ్యసంఘమే, నేలమెతగానున్నది. ప్రస్తుత
మంతగా లేదుగాని, వెనుకటి కాలమున పోలీసుబుట్ట గ్రామ
ములో మెదిలినట్లు కనుపడినంతనే, యిండ్లు వాకిండ్లు బిగించి
ప్రక్కనున్న పల్లెలకు వెళ్లిపోవువారట. వర్తమాన కాలమున
గూడనున్నతాధికారులు, వారఘండు, మొదలగు పనులపై
గ్రామమునకు వచ్చినంతనే, వైశ్యులందరును గుమిగూడి,
యేకముఖమున తమ స్థితిగతుల ననుసరించి, సమాధానము
చెప్పుకొను ధైర్యముచాలక, ముఖము దప్పించుట, పలుగ్రా
మములలో పరిపాటియైనది. ఇంతటి యధికార భీరుత్వము
గల్గుటకు, ప్రపంచజ్ఞాన లోపమున్నూ తనలోతమకు సంఘీ
భావములు లేకుండుటయున్నూ, కారణములు.

గీ॥ సన్నయుద్యోగి మొదలుగ నున్నతాధి
కారివరకు ప్రభుత్వాధి కారులెల్ల
చిక్కినప్పుడు వైశ్యుని చెండితినుట
యందు, మెతకగ నెంతు ర । త్యంతముగను,

గీ॥ ఇన్ని విధముల జెప్పగ నేల వైశ్య
డెట్టి యధికారి గొడ్డలి పెట్టుకైన,
పోలికి మానైనగాదు సం । పూర్ణముగను
చచ్చిచివికినబూరుగు । శాఖగాని.

కథ:-

ఇంతటి దైన్యస్థితికి కారణంబేదియో కన్గొనుడు
దేశరాజకీయంబుల నైశ్యులు దిగకుండుటయొకటి,
యల ప్రభుత్వ యంత్రిముతో జోక్యము । గలుగకుండుటొకటి
పరిపాలన శాఖలలో వైశ్యులు । అరుదగుటయు నొకటి,
ద్రవ్యార్జనలో మునిగి తదితరము । దలుపకుండుటొకటి,
లోకజ్ఞానము దేశజ్ఞానము । లోపించుటయొకటి,
సంఘబలము తమవెనుకనున్నదను । స్థైర్యములేకొకటి,
గుండెధైర్యమే యవలంభింపని । గొప్పలోపమొకటి,
అన్నిటికి మూలంబగు కారణమగియె । విద్యలేమి! ॥వైశ్య॥

వచ:- సరే! లేనివిద్య, ఒక్క సంవత్సరములో, ఒక తరములో సంఘమందంతటను వ్యాప్తము కాజాలదనియే భావింతము. వర్తక వాణిజ్యములైన వైశ్యుల చేతిలోనున్నవా యని విచారించితే, యవిగూడ వీరిచేయి దాటిపోయినవి. దేశీయమగు చిల్లర వ్యాపారమేతప్ప, ఖండాతర వ్యాపారములును, ఓడవ్యాపారములున్ను, పాశ్చాత్యుల హస్తగతమైనవి. భారతవాణిజ్యపు పెట్టుబడిలో నూటికి డెబ్బయిఒక్కపాలు బ్రిటీషువారున్ను, జపాను మొదలగు విదేశముల పెట్టుబడి

కొన్నిపాళ్లున్ను, భారతీయేతరుల పెట్టుబడి కొన్నిపాళ్ళున్ను, గలిగి, వైశ్యులకు నూటిలో యేభదిపాళ్ళకు తక్కువగనో పెట్టుబడిగలదు.

కధ:-

వృత్తిహీనమై పోవుట కేనియు విలపింపగబోరు.
సంఘశ్రేయము కొఱకై పైసయు జారనివ్వరండీ!
గుమ్మడికాయలు పోవుకంత గనుగొనజాలరుగానీ,
ఆవగింజలే పోవుమార్గము ల। నరసిచూతురేల? ॥వైశ్య॥
ఆ, జపానువర్తకులను జూడుండాదాయమునందు
ప్రతియొక రూప్యమునందు రెండణాల్ । భాగమువలబెట్టి
యిట్టిబేడ భాగంబులన్నియును । యెన్నియో కోట్లయిన,
ఆధనంబుతో వర్తక సంస్థకు నధికబలముగూర్చి
రాచకీయముగ దేశమంతటను ప్రాముఖ్యతగూర్చి
శాసనభలకు ప్రతినిధి యెన్నిక జరుగు సమయమందు
సంస్థతరఫునను వ్యక్తులనిలిపియు ' సాహాయము జేసి
మండలసభలను రాష్ట్రసభలలో మఱియు కేంద్రసభలో
ప్రాతినిధ్యమును వర్తకసంస్థకు బలకర మొనరించి,
దేశవిదేశ ప్రభుత్వములందు, ప్రతిష్ఠను సమకూర్చి,
పరిపాలన శాఖలందు సంస్థకు । పలుకుబడి ఘటించి,
రాజ్యచక్రమెల్లపుడును । వర్తక । రక్షణ కనువుగనే
తిరుగుచుండు నటు కట్టుదిట్టములు । వరుసగనొనరించి,
వాణిజ్యంబులు స్వేచ్ఛగ నెవరివివారె చూచుకొనుచు,

నీరీతిగ వర్తకపు కాయిదానెల్ల వర్తకులును
వృత్తిరక్షణకు రాజకీయముగ వెచ్చించెదరచట! ॥వైశ్య॥
మనదేశములో తద్విరుద్ధముగ । వినియోగంబగును,
రాచకీయముగ ఖర్చుచేయరే । రాగిదమ్మిడైన,
వృత్తికి బలమొనగూర్చు పద్ధతిని బొత్తిగ వదలియును
సంఘబలముచే కూర్చుటకేమియు జారనివ్వకుండా
పూర్వాచారపు పిచ్చిధోరణిలో । పూర్తిగబడిపోయి
పూజలకును, దద్ధోజనములకును । పులిహోరములకును,
కైంకర్యములకు నుత్సవములకు ఘనగోపురములకు
చలువరాళ్ళకును పాలగచ్చులకు సంతర్పణలకును,
వ్యక్తులయొక్క పరిభుత్వ బిరుదులకు వారివిందులకును,
వారియుత్సవపు సన్మానములకు నూరేగింపులకు,
హరికథలకును పురాణంబులకును । నర్తకులకు మరియు
నఱచేతిలో వైకుంఠముజూపెడు । నట్టిబూటకులకు,
తిన్నఇంటి వాసాలను లెక్కెడు తిరిపెగాండ్లకిచ్చి
తాత్కాలికమగు వ్యక్తిపొగడ్తల దనియుదురేకాని
రాచకీయముగ సంఘోన్నతికై యోచనయే లేదు
సంఘము సంస్కారంబొనరించెడు । సంకల్పమె లేదు.
ఇంతమౌఢ్యతకు కారణమేమో యెరుగలేరెమీరు
దేశీయంబగు రాజ్యతంత్రమును । తెలియకుంటచేత
దేశకాలమార్పులను సూక్ష్మముగ । తెలుసుకొనగలేక
అధునాతనము సనాతనము స । మన్వయింపలేక
సకలదేశముల గతచరిత్రమును । చదువని కతమునను

కూపస్థంబగు మంశూకపు సం । కుచిత దృష్టిగలిగి
యభివృద్ధిని గోల్పోవనున్నవా । రార్యవైశ్యులిపుడు ॥వైశ్య॥

వచ:- వ్యక్తివిషయముగ ధైర్యస్థైర్యముల గలిగి యుండుటగూడ సోదర మానవులతో గౌరవముగ కలిసిమెలసి తిరుగుటయుం దవసరమైయున్నది.

# వ్యాయామము ధైర్యస్థైర్యములు

సభ్యతాప్రవర్తన

కథ:-

దేహపటుత్వము దేహబలంబును దేహదార్ఢ్యతయును
వ్యాయామం బొనరించి సాధకము చేయనచ్చునయ్యా!
ధైర్యోత్సాహము దుర్బలులందున । తరమగ, గనపడదు!
ప్రతిచోటను వ్యాయామ శాలలను । ప్రతిష్ఠించుడయ్యా!
ప్రీతియువకులందును శిక్షణనుచ్చట । బడయునట్లు జేసి
దేహబలమునకుతోడు బుద్ధిబల । తేజంబులగూర్చి
ధైర్యస్థైర్యములందున లోపము । తగ్గజేయుడయ్యా
ఆత్మగౌరవము హీనంబయ్యెడు నట్టియెడలనేని
ప్రతికక్షుల నెదురొడ్డి ధైర్యంబు జూపకున్న
వానికి వ్యక్తిత్వము గలదని దల । పంగ జాలరెవరుర
సంఘర్షణమున హింసాఫలితము । సంభవించుననుచు
గౌరవహీనపు పిఱికితనంబును । గనపఱచకుడయ్యా!
అట్టిభీరుతన, మహింసయగునని । యనుకొనవలదండీ!

ఆ' యహింస । లో వజ్రసన్నిభం । బై నకతినతయును
సుమమ్మృథులతమును నిమిడియుడె?ంచిధీగా !ంపస?
శక్తిగల్గియును నోరిమిజూపుటే సరియైనయహింగాబ
గాని యశక్తతగూడ నహింసగ । గణుతింపగరాదు!
అట్లని చీటికిమాటికి జగడము నారంభింపకుడు;
అతిపవిత్రమగు నాత్మగౌరవము । చితికిపోవునప్పుడే
స్వీయశక్తులను యెదిరికిజూపుట । శ్రేయస్కరమగును,
యెదిరినిమార్గాని వ్యవహరించుటయ నెంతో ।వ్రమమును మ
డబ్బుపోవునని డగ్గుత్తికపడి డాంబికమున కడలి
లోకముసుచుకొని పోవుటయాత్మ ద్రోహమానుసుండీ!
సహజంబేయిది' దేహబుద్ధిబల । శక్తిలోపమైన
శౌర్యధైర్యములు మనుజునియందున । నమసిపోవునయ్య!
పిశినాశిత్వము లోభితనంబును । పె పొందెదునయ్య'
బొత్తిగవిద్యా గంధమెరుంగని మొరటుమానిసులకు
ఆకలిమంటచె నకనకలాడెను నట్టినునుష్యులకు
నూటకుముందే క్రోధముగల్గుట మానవసహజంబు!
ఆట్టివారలను నెనరుతో జూచియు నాదరింపవలయు;
దీనమానవుల సేవాధర్మము తెలిశినవారలకు
భూతదయాంతః కరణంబులుగల బుద్ధిమంతులకును,
పేదవారితో సంఘర్షణము, ల, । భింపబోదు! నిజము!
సామాన్యంబుగ లోకము, ప్రకృతి । చక్కజూచితేని
ధనమేబంధువు! ధనమేమిత్రుడు । ధనమేసర్వముగ!
ధనమే ప్రేమగ! నెన్నుట గనబడు! తథ్యంబీమాట!

కానియుత్తమని ప్రకృతిదీనికి కడుదూరంబయ్యా!
ప్రేమయె ధనమును! ప్రేమయె బంధువు ప్రేమయె, సర్వముగ
నెన్నుట, తనదగు, గుణలక్షణముగ । నేర్పడునాతనికి,
అట్టిసజ్జనున కెవ్వరిచేతను నపకృతిరాబోదు!
ప్రేమపూర్ణ హృదయమునకు నెల్లెడ ప్రేమేలభియించు
మాత్సర్యంబులు ద్వేషములాతని ముందటనిలువవుగా!
సర్వత్రను పూజ్యతయే యతనికి । సంఘటించుచుండు.

## స్త్రీ విద్య

---

కథ:-

స్త్రీకంటెను పురుషుండె యధికుడను చెనటినమ్మకంబు
స్త్రీని, యబలగా, యజ్ఞానిగను । జేసివైచెనయ్యా!
శంభుడర్ధనారీశ్వరుడగుటలో । స్వారస్యంబేమొ
తెలిసియుండినా స్త్రీని లాఘవపుదృష్టితో జూచెదవా?
ఆదిలో స్త్రీలకు విద్యాసామర్థ్యంబులుగలవండీ!
సర్వవిద్యలను సర్వకళలలో । సర్వశాస్త్రములలో
ప్రఖ్యాతిసిగడియించినమగువలు । పలువురుగలరండీ!
ఆత్మశక్తియును సశస్త్రశక్తియును । సతివంకున్నదయా!
తనభర్తకు సావిత్రిప్రాణములు । దక్కించుటవినవా!
ఆహవంబునను సత్యాసతి శౌ । ర్యముజూపుటవినవా!
రాజపుత్రి సంయుక్త రణంబున । రాణించుటవినవా!
ఝాన్సీలక్ష్మీ, మీరాబాయిల । సాహసములుగనవా!

ఇపుడుసరోజిని దేవియుపన్యా । సపుధోరణిగనవా!
విజయలక్ష్మిప్రభృతులపాండితీ । విభవముగన్గొనవా,
పురుషునియందుననర్థభాగినిగ । బాగడొందినస్త్రీకి
బుద్ధివికాసము గల్గకపురుషుడు । పూర్ణశక్తుడౌనా!
విద్యాబుద్ధులు స్త్రీలకుండునను । విస్తరింపకున్న
జనసమానమేదియున భివృద్ధిని । సాధింపగలేడు
భార్యదాసివలె వంటగృహములో । పనులొనర్పనేనా!
అలంకారమగు కామవస్తువుగ । నామెనుంచుటేనా!
గృహపాలన మొదలైన వృత్తులలో । గృహిణిమంత్రిగాను
సహకారిగ మిత్రుడుగను భాగస్వామిగ కావలదా?
తల్లిబోధయె మనశివాజి నం । తటి వీరుని జేసె!
చాంకుసైకుసతి, జూడుడు! భర్తకు । సర్వకాలములను
బాసటయై వీరాధివీరునిగ । పరిఢవిల్ల జేసె
మాతృప్రాథమిక బోధయె । గాంధికి మహాత్మ్యముగూర్చె
ఇన్ని యేల! లోకమున చరిత్రలనెల్ల జూచితేని
తల్లియొ, భార్యయొ, విద్యావైశ । ద్యము గల్గుటకతనన్
వీరులు నాయకులును మహాత్ములును । వెలసిరి భువియందు
గావున మీపుత్రికలకు విద్యలు గ్రన్నననేర్పండీ!
స్త్రీలకు విద్యలు పనికిరావనెడు । చెనటిస్వభావంబు
మోసంబజ్ఞానంబవి నీతియె । యౌ! సత్యంబిదియు,
అట్టివారు తమ భావిసంతతికి । హైందవమతమునకు
దేశంబునకును గూడద్రోహులే । తిన్నగ జూచినను,

లెండు! సంకుచితదృష్టిని పోద్రో । లండీ! యువకులారా!
రండు నా స్వభావముల విడిచివే । యుండు! వైశ్యులారా॥హి॥

# వైశ్యసంఘములో

## పరస్పరయీర్ష్యాసూయలు

——(0)——

వ:-ప్రస్తుతము వైశ్యసంఘములో నంతఃకలహము లును, పార్టీలును యేర్పడియున్నవి. వాటిమూలకారణముల నారసి, మీలో మీరైకమత్యమును బలపరచుకొననిచో. యీక్లిష్ట పరిస్థితులలో మున్ముందు గొప్పవిపత్తునకు గురి యయ్యెదరు.

కథ:-

పెచ్చుతగ్గులను చచ్చువాదముల నీసడించుచున్న
యట్టి ప్రస్తుతపు కాలమందె, మీ । యందుమీకు ప్రథమ
తాంబూలము కొఱకై విభేదములు । తగునె? పెంచుకొనగ?
అగ్రకులమనెడు సురభిమానమే ॥ వ్యర్థభావమైన
నగ్రత తాంబూలంబునగోరెదు । నభిమానం బేమో?
యింతిమాత్రమునకే పార్టీలను యేలబెట్టుర యేల్లా?
వ్యాపారపు పోటీలు పెంచుకొని । వ్యవహరించువారు,
ఒక్కరేనియును గాకుపడగలే । దెక్కడ నేనియును,
పైగ పరస్పర విద్వేషంబులు । ప్రబలిపోవునండీ?

న్యాయంబగు లాభమును చేర్చుకొని । యందరొక్కధరకే,
వస్తువస్త్ర విక్రయము జేయునెడ । వచ్చునెపోటీలు?
వర్తకరుసుము, వసూలు జేయుటలో । వ్యయపరచుటయందు
కలహంబులు రేగుటకు కారణము ॥ కార్పణ్యమెగాదా?
వ్యక్తులస్వార్థపు దృష్టిలోరుసుమును । వ్యయముజేయకుండ
నచ్ఛముగా సంఘాభివృద్ధికే । నదివినియోగింప
బడుచుండిన యెడ వైమనస్యములు । ప్రబలగలవెయిట్లు?
ఆశౌచము పదిదినములనియు. పదు । నైదు దినములనియు.
వ్యర్థంబుగ కలహములు బెంచుకొని । వ్యవహరింపనేల
చచ్చినజీవుల గతినిగూర్చి త । ర్జనభర్జనలేల?
బ్రతికియున్న వారల గతికొరకై । పాటుపడగరాదా?
పౌరోహిత విషయంబుగ మీలో । పార్టీలేలనయా?
పూజారిని నియమించుట యందున । పోరుపులేలబాలో!
అహహా! శాస్త్రాచార్యులపార్టీ । లవి మీలోలేవా?
మునసబుపార్టీ కరణముపార్టీ । మనలోమనకేనా!
పగులునట్లు తలగొట్టుకొనుటకే । బడ, నైతేనేమి!
మీలోమిమ్ముల చీలదీసియును । మిక్కిలిసుళువుగను
నొక్కరొక్కరినె క్రమముగ మ్రింగుట । కైకల్పితమయ్యె!
గానిమిమ్ములను రక్షించుటకై । గాదీపార్టీలు!
సంఘభేదమే, సంకుచితంబన । శాఖలేల? మీలో?
నేతికోమటులు నూనెకోమటుల । నెడు, భేదంబులను
లింగదారికోమట్లును, బేరులు, లింగములేనట్టి
కోమట్లనియెడు శాఖాభేదాల్ । కుళ్ళగించివైచి

యందరొకటిగా నుండుట కింతటనైన బూనుకొండీ!
యిన్నియేల! మీచిన్నచూపె మీ । కిన్నిపాట్లుదెచ్చె!
మీలోమీరలు సౌహార్ధముతో । మెలగుచెరుగ రేల?
''ఎవరికివారే'' యమునాత్రీరే! ''యెప్పటికప్పుడే!'' య
న్నట్లు సంకుచితమైనదృష్టియే । యధికులలోగలదు!
అడుగడుగునకును మాటమాటకును । నాదాయమెకోరు
నట్టిధోరణినె ఇక సాగించిన । హానితప్పదయ్యా
సేలుటాక్సు ఋణముల తగ్గింపును । జేయునపుడుమీరు
సంఘైక్యతతో ప్రతివాదంబును । సలుపగలిగినారా?
యజ్ఞంబును జేయించినబోవునె? యీచట్టములిపుడు

## వైశ్యయువకుల కర్తవ్యము

వచ:-యువకులారా? మీధనమే మిమ్ములరక్షించు నని వెనుకటివలె యితరజోక్యమేమియు కల్పించుకొనక మిన్న కుండటెగను.

కథ:-

ఓహో? యింతట మేలుకొనండీ? యువకవైశ్యులారా?
కన్నులువిప్పియు లోకమునంతా । కలయజూడుడయ్యా?
ఎవరెటుబోయిన నేమి? మాకుగల ! యీభాగ్యములున్న!
నని మిన్నకయుండెడు కాలంబది యంతరించెనండీ!
ప్రజాప్రతినిధులు చట్టములు బహుభంగులుగాను

మారుచున్న యీసంధికాలమున । 'మనది' యనున దేది?
మెరకనుండియును మన్నుపల్లమునకు । మెల్లగజారుటయే
ప్రకృతినైజముగు! గాన ధనిక వ । ర్గముయొక్క ధనంబు,
జార్చి దరిద్రుల నుద్ధరించుటయె సహజముగాజరుగు
నెప్పుడెప్పుడెట్లెట్లుజారునో । యెవరు చెప్పగలరు
కాని, భవిష్యద్భారత రాజ్యాం । గపు యంత్రమునందు
మీపాలుకువయే లేకుండినచో । మీగతియేమగును?
ప్రతివాదము లేకుండనె చట్టముప్యాసై పోవుగదా!
ప్రజాప్రభుత్వ పరిపాలనంబు తమ । పరమొనర్చుకొనగ
దేశ రాజకీయపు పక్షంబులు । దివురుచున్నవండీ!
ప్రతియొకపక్షము ప్రజాకర్షణకు । ప్రాకులాడుచుండె
కాంగ్రెస్ కమ్యూనిష్టు, కిసాన్ ప । క్షంబులొక్కటొకటి
హిందూముస్లిం మతపక్షంబులు । యెదిగి వేఱువేఱ
ప్రస్తుత మున్నప్రభుత్వ యంత్రమును । వశము జేసుకొనగ
హస్తినాపురపు మార్గముబట్టియు । నరుగుచున్నవండీ!
మీ రేపక్షము ననుసరించెదరో? మీరె తేల్చుకొండీ?
ఇంకను ధనసంపాదనమందే । యెడ తెఱపియు లేక
రాచకీయముగ కొంతయేనియును । యోచననే లేక,
మీ రేయొకపక్షమునకు గూడను । మిత్రులుగా రేని,
యెవరుగూడను మిమ్ము నమ్మకను । దోవగించి రేని,
రెంటికి జెడినా రేవడలై మీ । రుంటిరేని ముందు
గబ్బిలంబునకు బట్టినగతియే గల్గుటనిజమండీ!
కాదా? జర్మనిలోగల యూదులగతి గల్గునుసుండీ ॥వై॥

కారణమేమో యింతలనైనను కనుగొననేలేదా?
మీధనంబు తృణమేనియు బీదలమేలుకొఱకుగాక
మూఢాచార పరిచారక సమితికే । ముట్టుచున్నదండీ!
మీదగు వృత్తియు శేషజనమునకు మేలుగూర్చలేక
నష్టసముగ మీస్వార్థమునకె, దోహదమయ్యెనుసుండీ!
అఖిలనిర్ధనులకన్న మీధనమునందె యున్నదండీ!
వృత్తివిహీనుల యీర్ష్య యువర్తక । వృత్తియందెనండీ!
కూలీరైతుల దృష్టిమీపైనె । వ్రాలియున్నదండీ?
యాశచపాళికి మీభాగ్యముపై । న సంతృప్తియండీ?
అధికారులకు నసహ్యము మీపై । నధికమైనదండీ!
అనధికారులును మీవంచనకే । యాచించెదరండీ?
యింతయేల? లోకంబు ధనికులనె । యీసడించుచుండు. ॥వై॥

వచ:- పై విషయములు మీలో సామాన్యులగువారికి సుబోధకములు గావుకాని! రాచకీయ వర్గపరిజ్ఞానము గల వారికి మాత్రము బాగుగా తెలియును.

కథ:-

దేశకాల సందర్భములెన్నియు తిలకించితిమేని
కాలచక్రమత్యంత వేగముగ । కదలుచున్నదండీ?
ప్రకృతి చక్రమారంభపు దశకే । పరుగిడియెడునండీ!
ప్రాతపద్ధతులు పాతిధర్మములు ప్రళయంబగునండీ!
ప్రాతక్రొత్త రెండింటిమధ్య వి । ప్లవము గల్గునండీ!
అట్టికాలమున నెట్టివిపత్తుల నందకుండవీరు

క్రొత్తపద్ధతులు క్రొత్తవృత్తులును । కోరి తెలుసుకొండీ!
వైశ్యులార! మీరింక భ్రాంతిలో బడియుండకూడయ్యా
పూర్వాచారపు పిచ్చిలో మీరలు పోగొట్టెదు ధనము
విద్యకు విజ్ఞానమునకు మీరలు వెచ్చింపుండయ్యా!
వర్తకరుసుములు సంఘవృద్ధికే వ్యయముచేయుడయ్యా!
వ్యక్తులకును వడ్డీకి ధనమొసగు వ్యాపారముమాని
పారిశ్రామిక కేంద్రంబులకును । బ్యాంకుల కివ్వండీ!
పదిమందిని బ్రతికించుచు మీరును బ్రతుకు పరిశ్రమకు
వస్తూత్పత్తికి, వ్యవసాయమునకు । పశుపోషణమునకు
మీధనంబు వినియోగింపండీ । మేలయ్యేమునండీ!
జనవశీకరణ ప్రజారంజకము । జరుగునిందువలన
కృషిగోరక్షణ వృత్తులనగనివె । వృషగానుమండీ?
ఆదికాలమున వైశ్యులకివియే । యాదరంబుగూర్చు
జనసామాన్యంబంతయు వైశ్యుల । సంస్తుతించుచుండె
ఆయోగ్యత్వము నాగౌరవమును । నావిజ్ఞానంబు
ఆసమైక్యతయు నాసౌహార్ధం । బప్పటిసుస్థితిని
తిరుగపొందుటకు మీవ్యత్త్వము సిం । స్ఫురణ జేసికొండీ!
అన్నివర్గముల కన్నివృత్తులకు । నండయిచ్చునట్టి!
భారతజాతీయోద్యమ మందున పాల్గొనరా రేల?
మీధనంబు మీవ్యక్తిత్వంబులు మీకుపయోగించి
సంఘ, సమాజము, లందున మరియును । జనసామాన్యములో
నాయకులై స్వార్థంబును వీడియు । నదుపుదుద్యమంబు
యువకవైశ్యులందరిని జెర్చుడీ । యువకోద్యమమందు

## యువజనోద్యమము.

విశాలభారతభావి వైశ్యయువజనోద్యమమును బలపరచి
మతసాంఘికదేశౌన్నత్యములకు మద్దతుజేయుండీ
భావిక్షేమతేజంబులలో పాలుపంచుకొండీ!
స్వర్గమో! నరకమో! యనుభవించుడి। సర్వులతో పాటు ॥వై॥

## ప్రబోధము



లే! లే! యువకుడ । కర్మవీరుడా! లెమ్ముదట్టిగట్టి
పిడికిలినీవుబిగించిన విశ్వముగడగడ రాదునయా!
అభివృద్ధివిరోధకులకెల్లనీ । నంటేనే "హడలు"
మతసాంఘికదాస్యపుకోటలకును । మరఫిరంగివీవు
స్వాతంత్ర్యవిరోధకశక్తులకును । సరిక్రొంగొంబల్లెమవు!
గ్రుడ్డినమ్మకపుటాచారములకు । గొడ్డలిపెట్టీవు!
నూతనధర్మస్థాపనంబునీ । చేతిలోనగలదు
యువకుడవగు నీయుడుకురక్తమే! యుత్తేజముగూర్చు
భావివైశ్య సంఘమునకె కాదీ । భరతదేశమునకు
భావినాగరకతా నిర్మాతవు । నీవె కానొప్పుము!
భావిఫలమునకు కర్తవునీవె । భావించుము సరిగా
సర్వస్వాతంత్రిమో! ఘోరదాస్యమో! చవిజూడగరావోయ్
॥లే॥వే॥

 సమాప్తము. 